# గీతాహృదయమ్

## ( భక్తియోగము )

గ్రంథకర్త :

ఆర్షవిజ్ఞాన ప్రబోధక

శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మ

ప్రతులకు :

శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మ

హనుమాన్‌వీధి

సత్యనారాయణపురం — విజయవాడ-11.

# అంకితం

కలిమానవ సముద్ధర్త్రియై

శేషాచలమున వెలసిన

శ్రీ వేంకటరమణునకు—

“అనన్యాశ్చింతయంతో మాం

యేజనాః పర్యుపాసతే

తేషాం నిత్యాభియుక్తానాం

యోగక్షేమం వహామ్యహం”

# విజ్ఞప్తి

మహాశయులారా!

భారతీయాధ్యాత్మిక వాఙ్మయ కాననమును సౌరభామోదిత మొనర్చు మహోపనిషత్సుగంధకుసుమ సంగ్రధిత వనమాలయే భగవద్గీతా శాస్త్రము.

ఇయ్యది ముకుంద ముఖోద్గీతమై వెలసి, అఖండ భారతమున సనాతన వైదిక సిద్ధాంత సరణిని దిద్దితీర్చుటకై వెలసిన శంకర, రామానుజ, మధ్వాది వైదికమతావలంబులచే వ్యాఖ్యానింపబడుటయేగాక, అధునాతన సాహిత్యపరంపరా ప్రాప్తమైన విజ్ఞాన సరణిని అనుకరించు ప్రాక్పశ్చిమ పండితులచేతకూడ, మానవ సమాజమున కందించదగు భౌతికాధ్యాత్మిక జీవితముల నీ గీతాశాస్త్రమే ప్రసాదించగలదని నిర్ణయింప బడినది.

భారతీయులారా! ఏతత్తుల్యమగు గ్రంధము విశ్వసాహిత్యమున మృగ్యమనుట అతిశయోక్తి కాదు.

మహాభారతాంతర్గతమగు నీ గీతాశాస్త్రము పదునెనిమిది అధ్యాయములుగల్గి ఏడువందల శ్లోకములతో కర్మ, భక్తి, జ్ఞానములను మూడు యోగములను ప్రసరించినది. కాని యీ మూడు యోగములును సంవాద రూపమగుటచే కేవలము ఒక్కొక్కయోగము ప్రత్యేక ప్రత్యేకాధ్యాయములందే చెప్పబడక పదునెనిమిది అధ్యాయములందును సంకలితములై నిర్ణయింప బడినవి.

అయ్యును, సామాన్యముగా పాఠకులు కర్మయోగము మూడవ అధ్యాయమని, భక్తియోగము పండ్రెండవ అధ్యాయమని వాడుకొనుటకలదు. అందుచేత ప్రతి యోగమును గురించిన విషయమును పదునెనిమిది అధ్యాయములందును వ్యాఖ్యానింపబడియే యున్నదను భావము పాఠకులకు నిర్ణీతమైలేదు.

గీతోపన్యాసములు జరుగుచున్నవను మాటను కొందరు మిత్రులకు నేను చెప్పగనే యే అధ్యాయమను ప్రశ్ననే వేయుచుండుట నా అనుభవము నందున్నది. కర్మయోగమును గురించిన ఉపన్యాసములు అనగనే మూడవ అధ్యాయమా ? అను ప్రశ్న ప్రతివారును వేయుటకలదు. కొందరు గీతోప న్యాసముల గావించునప్పుడు ప్రత్యేకముగా, అధ్యాయసంగ్రహములను వివరించుటకూడ గలదు. అప్పుడు వారు ఆ అధ్యాయములోని విషయమును ప్రతిపాదించునప్పుడు పూర్వాపరాధ్యాయములందుకూడ నీ విషయము కలదని నిర్వచింపక తప్పదుగదా ?

ఉదాహరణమునకు భక్తియోగ మనుకొనుచున్న పండ్రెండవ అధ్యాయముననే భక్తిని గురించిన ప్రస్తావనలేదు. ఇతర అధ్యాయములందుగూడా భక్తిని గురించిన మాటలు వినవచ్చుచున్నవి. అందుచేత కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగములను శీర్షికలతో గీతాశాస్త్రము నంతయు విభాగించి ప్రతియోగమును గురించిన సాధ్యసాధనసామగ్రియు ఒక్కచో కూర్చుకొన్నచో బాగుగ గ్రహించుటకు వీలగునను భావముచే నేను గీతాశాస్త్రమును యోగత్రయ విభాగమును గావించి, మూడుయోగములను గురించి ప్రత్యేకముగా ఉపన్యసించుచూ ప్రచారము గావింపగా కొందరు మిత్రులు మీరు చెప్పు విధముగా గ్రంథరూపమున వెలయింపుడని కోరియుండిరి. అందుచే యీ శాస్త్రమును ఉపన్యాసపరణినే ప్రచురించనయకల సార్వజనీనముకాదను ఆశయమున సామాన్య వ్యావహారిక భాషనే వినియోగించి, విషయప్రధానముగా కృష్ణావంద విజయులగోష్ఠి అను రూపకమున పాఠకులకందింప నిశ్చయించి, కర్మయోగమును 1970వ సంవత్సరమున ప్రచురించియున్నాము. అది కొందరు భక్తశేఖరుల హస్తగతమై, అందరి భావములు వారి వారి హృద్గతములుకూడా అయియుండవచ్చును. రెండవది భక్తియోగము. కర్మయోగ ప్రచురణమునకు ఒకే వ్యక్తి దాతకాగా యీ భక్తియోగ ప్రచురణము సమష్టి పూజాఫలమును అందించ గలిగినది. ఇందు వారామాయణ, మహాభారత, భాగవత, గీతోపన్యాసములను విన్న శ్రోతలలో కొందరు యీ భక్తియోగ ముద్రణమునకు రాజపోషకులు, పోషకులు, దాతలు, అన్న నామకరణములతో సాయపడి మిగిలిన పాఠక

లోకమునకుకూడా యీ గీతా సారస్వత మాధుర్యమును పంచుటకు తోడ్పడినారు. "ఏకస్స్వాదునభుంజీత" అను మహా భారతోక్తి ననుసరించి తాముగ్రోలిన యీ భక్తియోగోపన్యాస సారసంగ్రహమును తమ సాటి సోదరులకు గూడా అందించుటకై యీ గ్రంథమునందు ప్రకటించిన దాతల త్యాగముచేతనే గీతాహృదయమునందలి రెండవభాగమైన యీ భక్తియోగ మును నేను ఆంధ్రలోకమున కందించ గలిగితిని. అందుకు నే నెంతయు యీ గ్రంథముద్రణకై త్యాగముగావించిన ఉదారులకు కృతజ్ఞుడనై బృందావనమునందలి వేణుగానమును కేవలము గోపికలకే ఆహ్వాన సంకే తము గావించి, అమృతమయస్వరముల మేళవించి, జగద్వాసులనందరిని సర్వస్వమును త్యజించి భగవచ్చరణార విందముల నాశ్రయింపుడని గీతా వినాదమును గావించిన శ్రీ కృష్ణుడు పై దాతల కందరకును, ఆయురారో గ్యైశ్వర్యముల నిచ్చి, ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార ముల నొసంగు గాకయని శ్రీకృష్ణబ్రహ్మమును ప్రార్థించుచున్నాను. అంతే గాక నా గ్రంథమును పరిశీలించుటకై సహృదయుల కందిరెచగా రాబోవు జ్ఞానయోగమునుగూడ ప్రచురించవగు ఆశీస్సుల నందించినందుకా పండిత ప్రవరులకును, నాగ్రంథ ముద్రణను చక్కగా భక్తిశ్రద్ధలతో ప్రచురించిన పరమేశ్వరీ ప్రెస్సువారికిని నా కృతజ్ఞతను తెలుపుచూ ఇంతటితో విర మించు చున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.

# భగవద్గీతాహృదయము
# పండితాభిప్రాయము

"బ్రహ్మవిద్యాలంకార"
బ్రహ్మశ్రీ-ముదిగొండ వెంకట రామశాస్త్రిగారు

శ్రీ చి. నందూరు సుబ్రహ్మణ్యశర్మగారు "భగవద్గీతా హృదయము" అనే గ్రంథమును రచించి నాకు సమర్పించగా చూచి యమందానందము నొందితిని.

శ్రీ శర్మగారు లోగా (1970 సం॥లో) గీతాహృదయము-కర్మయోగమును రచించి నాకు చూపగా అందలి వారి గీతా కర్మయోగ సమన్వయమును, వారికిగల స్వధర్మానుష్ఠాన శ్రద్ధాభక్తులను గాంచి యానందించి నా యభిప్రాయమునొసంగి యుంటిని.

ప్రస్తుతము గీతాభక్తియోగ సర్వస్వ మనదగినట్టి భగవద్గీతా హృదయమును-విజయ-శ్రీ కృష్ణానంద సంవాదరూపముగ-అభ్యాస-జప-ధ్యాన - భగవద్విభూతి - భగవదనుగ్రహ-లోకాంతరయాత్రా-శరణాగతి నామక-సార్థక సప్తప్రకరణములతో (క్రౌన్ 1/8 సైజు 160 పేజీలలో) చక్కగ రచించి గీతామధ్య షట్క-భావముల వెలువరించిరి.

ఇందనేక గీతాశ్లోక, యోగసూత్ర, భాగవతాద్యుదాహరణములతో పండిత పామర రంజక లలితభాషతో, అనేకాధునాతన శంకా నివారికముగా-సగుణ నిర్గుణ భగవద్భక్తి మార్గమును విశదీకరించినందుకు ఆంధ్ర భక్తలోకము వీరికి ఋణపడినదనవచ్చును.

భగవదనుగ్రహమున వీరికి చిరాయురారోగ్యైశ్వర్య భాగ్యము లవిచ్ఛిన్నముగ గల్గి గీతాహృదయము-జ్ఞానయోగమునుకూడ రచింతురు గాకయని యాశీర్వదించు చున్నాడ-

త్రిలింగమహావిద్యాపీఠం,
విజయవాడ-2,
బందరురోడ్డు.

ఇట్లు,
ము-వెం-శాస్త్రి,
30-3-73.

# అభిప్రాయము

తత్త్వశాస్త్రములు గురుశిష్య సంవాదరూపములు. ఛాందోగ్యము, తైత్తిరీయము మున్నగు నుపనిషత్తులును, భారతము, విష్ణుపురాణము, రామాయణమువంటి యుద్గ్రంథములును గురుశిష్య సంవాదరూపములే. నిజమునకీ శిష్యులు శిష్యులేకారు. రక్తసంబంధముగల పుత్రులో, మేనత్త కొమరులో ఇట్టివారే.

బ్రహ్మశ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మగారు భగవద్గీతలోని యంతరార్థమును గ్రహించినారు. వారు సంజయ ధృతరాష్ట్రులనుగాక సాక్షాత్పరమేశ్వరాంశభవుల నరనారాయణులనే సాక్షాత్కరించుకొనినారు. రణరంగమున "శిష్యస్తేహం శాధిమాం త్వాం ప్రపన్నం" అని మూర్ఖతచే, అతిపరిచయముచే నీచసంబోధనలఁచేసి పరిహసించిన తన బావ (మఱది) దీనదశలో నున్నప్పుడు, పండితమ్మన్యుఁడై వికట ప్రశ్నలు వేసినప్పుడు ప్రియమిత్రుఁడు నిజమైన బంధువుఁడు. సర్వతత్త్వ విదుఁడగు పరమేశ్వరుఁడు చేసిన బోధలను గ్రహించినారు. వారినే కృష్ణునిఁ 'గృష్ణానందుని'గా విజయుని 'విజయుని'గా మన కనుల యెదుట నిల్పినారు. అనఁగా మనలను విజయులనుగాఁజేసి, తాము కృష్ణానందులైనారు, వినిన మనము ధన్యులము.

శాస్త్రములు నానారూపములు "భగవద్గీత" భారతములోని రణరంగమున 10వ రోజు యుద్ధము పూర్తియైన తరువాత ధృతరాష్ట్రునకు సంజయుఁడు చెప్పిన యుద్ధవార్తారంభము. కాని శాస్త్రకారులందఱు దానిని శాస్త్రముగా స్వీకరించినారు. వారి వారి బుద్ధిభేదముచేఁ దాము సత్యమని నమ్మిన సిద్ధాంతములను పరవాద నిరాకరణ పురస్సరముగ స్థాపించికొనినారు. నిజము తెలిసికొనిన వ్యక్తి పరోక్ష జ్ఞానశూన్యుఁడుగాన నున్నదాని సత్యములనికాని యసత్యములనికాని నిర్ణయించి వాదింపక, స్వాభిమత పరంపరాప్రాప్త సిద్ధాంతము నాచరణలోఁ బెట్టికొనును. అంతేకాక భగవ

ద్గీత మన్వాదిస్మృతులవలె కరణీయాకరణీయములఁ దెల్పక మానసిక శాంతిని జేకూర్చు దివ్యరసాయనము. ఏ మతమునకును మానవశాంతి యవసరమే. కావనే యిది సార్వజనీనమైన యమృతరసాయనము.

శ్రీ మదూరు సుబ్రహ్మణ్య శర్మగారికి నా హృదయపూర్వక శుభా శంసలనొసఁగుచు, ఇట్టి భగవచ్చరిత్రములతో సాధుశీలముల నుపదేశించుచుఁ జిరకాలము మా కానందము గలిగించు నట్లనుగ్రహింప నా "విజయ, కృష్ణానందుల" ప్రణామ పురస్సరముగఁ బ్రార్థించుచున్నాడను

కో॥ వేం॥ కృష్ణమాచార్యులు,

ది 2-4-79,

(Retd.) ఓరియంటల్ కాలేజీ లెక్చరరు,

విజయవాడ-1.



గ్రంథకర్త, వారి ధర్మపత్ని.



శ్రీ యాదా శేషయ్యగారు, వారి ధర్మపత్ని.



శ్రీమతి బ్రహ్మదేవులబోయిన అనంతలక్ష్మిగారు.



శ్రీ మేళ్ళచెరువు సత్యానారాయణగారు.





శ్రీ పందిరి పాపారావుగారు.





శ్రీ పుల్లఖండం పురుషోత్తం సోదరులు.

# రా జ పో ష కు లు

శ్రీ పుల్లఖండం పురుషోత్తం సోదర్లు, మధిర. 116-00

శ్రీమతి మూలూర్పురు వరలక్ష్మమ్మగారు, గుంటూరు. 116-00

శ్రీమతి బ్రహ్మదేవులబోయిన అనంతలక్ష్మిగారు, మానుకోట. 116-00

శ్రీ కంకిపాటి సత్యనారాయణరావుగారు, ఖమ్మం. 116-00

శ్రీ మేళ్ళచెరువు సత్యనారాయణ, పందిరి పాపారావు గార్లు, కోదాడు. 116-00

శ్రీ కొత్తూరు శాయన్నగారు, కోదాడు. 116-00

# పో ష కు లు

శ్రీ హర్కార జగన్నాథరావుగారు, వకీలు ఖమ్మం. 51-00

జగర్లపూడి సుబ్బరామయ్యగారు, ఇన్‌కంటాక్సు ఆడిటరు, ఖమ్మం. 51-00

కందిబాడ శ్రీనివాసరావుగారు, ఎడ్వకేటు, ఖమ్మం. 51-00

శ్రీమతి ముత్తవరపు వెంకటప్పయ్యగారి భార్య లక్ష్మీనరసమ్మగారు, కాపుగల్లు. 50.00

శ్రీమతి పిరాట్ల వెంకటరామనరసమ్మగారు, కొత్తగుడిబండ. 50.00

# దా త లు

శ్రీ సుగ్గల మల్లేశలింగం గుప్తగారు, సత్తుపల్లి. 25.00

శ్రీమతి ఊటుకూరు లక్ష్మీనరసమ్మగారు డాటర్ ఆఫ్ మోటూరు కేశవరావుగారు. 25.00

శ్రీమతి సుగ్గల శేషారత్నంగారు. 25.00

శ్రీ రామకృష్ణ ధర్మసంస్థ ధర్మకర్త భూపతిరాజు నీలాద్రి రాజుగారు, కుముదవల్లి. 25.00

భూపతిరాజు వెంకట్రాజుగారి కుమారుడు విస్సంరాజు గారు, కుముదవల్లి. ”

భూపతిరాజు రామమూర్తి రాజుగారి కుమారుడు నరసింహరాజుగారు, కుముదవల్లి. ”

నడింపల్లి సూర్యప్రకాశరాజుగారి ధర్మపత్ని వెంకట నరసయ్యగారు, కుముదవల్లి. ”

కరిమెరక గురవయ్యగారి కుమారుడు అచ్చన్నగారు, భీమవరం. ”

పరచా శ్రీనివాసరావుగారు, వకీలు, ఖమ్మం. ”

మాదిరాజు కిషన్‌రావుగారు, వకీలు, ఖమ్మం. ”

సర్వదేవభట్ల విశ్వనాథంగారు, ఎడ్వకేటు, ఖమ్మం. ”

సిరం కృష్ణమూర్తిగారు ఖమ్మం. ”

ముత్తవరపు అమ్మయ్యగారి కుమారుడు శీతారామయ్యగారు, కాపుగల్లు. ”

యాతవాకిళ్ళ రామకృష్ణయ్యగారు, ఖమ్మం. 20—00

శ్రీమతి ముత్తవరపు వెంకటసుబ్బమ్మగారు, కాపుగల్లు. 20—00

కోడాటి కమలమ్మగారు చెన్నారం 15_00

శ్రీ పలివెల అప్పారావుగారు, పటువారీ, మధిర. 10.00

శ్రీమతి ఊటుకూరు దుర్గమ్మగారు, మధిర. ”

గద్దెనపూడి శారదాంబగారు, మధిర. ”

శ్రీనివాసుల వెంకటలక్ష్మమ్మగారు, మధిర. ”

| | |
|---|---|
| శ్రీమతి గండకట్ల కళావతిగారు, మధిర. | 10.00 |
| మాధవరపు పద్మావతిగారు, మధిర. | ,, |
| శ్రీ ఆదిరాజు రంగారావుగారు, మధిర. | ,, |
| ములకలపల్లి రంగయ్యగారు, మధిర. | ,, |
| పల్లబోతుల వెంకటేశ్వరరావుగారు, మధిర. | ,, |
| మాటూరు కిషన్‌రావుగారు, మధిర. | ,, |
| పెగళ్ళపాటి వెంకట్రావుగారు, మధిర. | ,, |
| గడ్డమణుగు నరసింహారావుగారు, తండ్రి హనుమంతరావుగారు, మధిర. | ,, |
| శ్రీమతి దోసపాటి లక్ష్మీకాంతమ్మగారు, మధిర. | ,, |
| శ్రీ మాటూరు రామప్పారావుగారు, మధిర. | ,, |
| వేముల సరస్వతీరావుగారు, టీచరు, మధిర. | ,, |
| అవధానుల సూర్యనారాయణగారు, లెక్చరర్, ఖమ్మం. | ,, |
| శ్రీమతి గంటి భానుగారు, మధిర. | ,, |
| దుగ్గిరాల రామశేషమ్మగారు, మధిర. | ,, |
| గడ్డమణుగు సుందరమ్మగారు, భర్త లక్ష్మీనారాయణగారు, చిలుకూరు. | ,, |
| శ్రీ జొన్నలగడ్డ కోటేశ్వరరావుగారు, కె. ఆర్. కాలేజి, కోదాడు. | ,, |
| బొడ్ల రంగయ్యగారు, కోదాడు. | ,, |
| చిలకపాటి లక్ష్మీకాంతారావుగారు, హనుమకొండ. | ,, |

| | |
|---|---|
| శ్రీ బి. రామారావుగారు, ప్రాథమిక పాఠశాలా ప్రధానోపాధ్యాయులు, కోదాడు. | 10.00 |
| మర్ల యజ్ఞనారాయణగారు, కోదాడు. | ,, |
| దారం నరసయ్యగారు, కోదాడు. | ,, |
| అవ్వారి పార్థివశంకరంగారు, అసిస్టెంటు యింజనీరు, కోదాడు. | ,, |
| పందిరి గురునాథంగారు, ఆంధ్రోపాధ్యాయులు, కోదాడు. | ,, |
| శ్రీమతి గొల్లపూడి దుర్గమ్మగారు, కోదాడు. | ,, |
| శ్రీ కోటు సుబ్బారెడ్డిగారు, కోదాడు. | ,, |
| ప్రగతి మహిళామండలి, కోదాడు. | ,, |
| దుంపల హరికిషన్‌గారు, ఇంజనీరింగ్ సూపర్‌వైజర్ పంచాయతి సమితి, కోదాడు. | ,, |
| గరిడేపల్లి స్వామిగారు, కోదాడు. | ,, |
| కొప్పు రామచంద్రరావుగారు, ఐరన్ మర్చెంటు, కోదాడు. | ,, |
| శ్రీమతి ముత్తవరపు పిచ్చమ్మగారు, కాపుగల్లు. | ,, |
| శ్రీ అంచా వెంకటేశ్వరరావుగారు, కాపుగల్లు. | ,, |
| వంకాయలపాటి ప్రకాశరావుగారు, మధిర, మాలీ పటేల్. | ,, |
| ములకలపల్లి నారాయణగారు, మధిర. | ,, |
| బాబూజీ హరిజన హాస్టల్, మధిర. | ,, |
| కొండపల్లి రామానుజరావుగారు, కె. ఆర్. ఆర్. కాలేజి లెక్చరర్, కోదాడు. | ,, |

శ్రీ మం. భరతరావుగారు, లెక్చరర్, కె.ఆర్.ఆర్. కాలేజి, కోదాడు. 10.00

కె. వి. యస్. ఆర్. యం. శర్మగారు, ఫిజిక్సు లెక్చరర్, కె. ఆర్. ఆర్. కాలేజి, కోదాడు. ,,

బసవరాజు వెంకటేశ్వరరావుగారు, మధిర. ,,

శ్రీమతి రాయపాటి అన్నపూర్ణమ్మగారు, మధిర. ,,

కోవెలమూడి సీతామహాలక్ష్మమ్మగారు, మధిర. ,,

శ్రీ నాగుబండ చలమయ్యగారు, గుడిబండ. ,,

ఇల్లా చినపుల్లారెడ్డిగారు, పాతగుడిబండ. ,,

శ్రీనివాసుల రామశాస్త్రిగారు, గుడిబండ. ,,

పి. రామానుజాచారిగారు, గుడిబండ. ,,

బి. హెచ్. పి. వీరయ్యగారు, గుడిబండ. ,,

బాకుల పాపయ్యగారు, శాయిల్ కన్సర్వేషన్ అసిస్టెంటు, కోదాడు. ,,

నాగుబండ రామమూర్తిగారు, కోదాడు. ,,

జె. వెంకటేశ్వరరావుగారు, కో-ఆపరేటివ్ సబ్ రిజిష్ట్రార్, కోదాడు. ,,

యమ్. నారాయణగారు, మేనేజర్, పంచాయతి సమితి, కోదాడు. ,,

కోటా జగ్గయ్యగారు, పంచాయతిసమితి కోదాడు. 5.00

వి. వి. నారాయణరెడ్డిగారు, కోదాడు. 10.00

కె. మోహనరెడ్డిగారు, యల్. ఇ. కోదాడు. ,,

శ్రీ ఆర్.కిషన్ రావుగారు, పంచాయతిసమితి కోదాడు. 10.00

తడకమళ్ళ జగన్మోహనరావుగారు, పంచాయతి సమితి, కోదాడు. ,,

,, గంద్ కృష్ణమూర్తిగారు, ఖానాపురం. ,,

శ్రీమతి ఎంగ్రడపల్లి నరసమ్మగారు, మధిర. ,,

,, కోనా చంద్రమౌళమ్మగారు, మధిర. ,,

,, జడల అయిలమ్మగారు, భర్త రాజయ్యగారు, మధిర. ,,

శ్రీ అల్వాల వెంకటకృష్ణారావుగారు, సిద్ధవరం. ,,

,, వట్టిపల్లి హనుమంతరావుగారు, ఖమ్మం. ,,

శ్రీమతి ఊటుకూరి సుందరమ్మగారు, ఖమ్మం. ,,

శ్రీ నామవరపు సీతారామారావుగారు, ఖమ్మం. ,,

శ్రీమతి చల్లా విమలమ్మగారు, ఖమ్మం. ,,

శ్రీ చతుర్వేదుల నాగభోగిశాస్త్రిగారు, ఖమ్మం. ,,

శ్రీమతి జక్కేపల్లి సరస్వతమ్మగారు, మధిర. ,,

శ్రీ వాసికర్ల కిషన్ రావుగారు, బ్లాక్ అసిస్టెంటు పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు కోదాడు. ,,

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# భగవద్గీతా హృదయము

—: మొదటిరోజు గోష్ఠి :—

## అభ్యాసయోగము

"అనన్యే నైవయోగేన మాంధ్యాయంత ఉపాసతే
తేషామహంస ముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్॥

అ. 12. శ్లో. 6. 7.

అది సాయంకాల సమయం. అప్పుడే రాగవతియైన సంధ్య చంద్రకిరణ సంస్పర్శనంతో ఆకాశమును వీడగా సంధ్యోపాసనలను నిర్వర్తించిన కృష్ణానందవిజయులిద్దరు వినిర్మలహృదయులై కూర్చున్నారొకచోట ఏకాంత ప్రదేశంలో.

భగవద్గీతా హృదయ పరిశీలనలో కృష్ణానంద విజయులిద్దరు ప్రధాన పాత్రలు. విజయుడు ముముక్షువు, జిజ్ఞాసువు కూడ. కృష్ణానందు డొకసిద్ధుడు, సాధకులకు మార్గదర్శకుడు. విజయు డాతనికి శిష్యుడు, మిత్రుడుకూడ.

భగవద్గీతా శాస్త్రంలోని కర్మయోగమును గురించి వారిరువురకు సంభాషణ జరగటం దాని హృదయమును విజయుడు గ్రహించటం జరిగింది. ఇప్పుడు భక్తియోగ విశేషములను గ్రహించటానికి వచ్చాడు విజయుడు.

విజయుడు : (అహంభో అభివాదయే.) గురువర్యులకు తన గోత్రనామములను చెప్పి, పాదతలములపైన శిరస్సును వంచి వందన మాచరించాడు.

కృష్ణానందులు : (అపికుశలం?) శిష్యుని వాత్సల్యంతో లేవనెత్తి అతని క్షేమములను గురించి ప్రశ్నించారు గురువర్యులు.

అంతటితో సంభాషణ ప్రారంభమైంది.

కృష్ణానందులు : ఏమిటీనాటి మన గోష్ఠి?
విజయుడు : గీతలోని భక్తియోగము.

ఆనందబాష్పములు జలజల రాలినాయి కృష్ణానందులకు. అతడు మధురమూర్తి రసమయహృదయుడు. అర్ధనిమీలిత దృష్టితో విజయుని చూచాడు. విజయుని ఉనికిలో ప్రపత్తి ఉన్నట్లు ఆయనకు గోచరించింది,

భక్తియోగమును గురించి ఆంతరంగిక విషయములను అడగటానికి అనుమతించారు కృష్ణానందులు. విజయుని మొట్టమొదటి ప్రశ్న ఇది.

వి : స్వామీ! భక్తియోగంలో ప్రత్యేకత ఏమిటంటారు?

కృ : కర్మయోగంలో భగవంతు డెక్కడున్నాడనన్న ప్రశ్న లేదు.

ఆయన వేదశాస్త్రములద్వారా అందించిన విధి కర్మను ఫలమును కోరకుండా నిష్కామంగా ఆచరించటం జరుగుతుంది. భక్తియోగంలో ఆయనను

ప్రత్యక్షంగా చూడగలగాలి. ఆ భగవంతుని సాక్షా త్కారం కొరకు ప్రత్యేకమైన అన్వేషణ జరుపగా ఆ కళ్యాణమూర్తియొక్క దర్శనం అబ్బుతుంది స్పర్శనం అందుతుంది. సంభాషణలుకూడా నడుస్తాయి. అదే భక్తియోగంలోని విశిష్టత.

వి : మరి భగవంతునకు రూపనామములు లేవంటారుగదా ఎల్లా కనపడతాడంటారు ?

కృ : రూపనామములులేని భగవంతుడు ఉన్నాడు. ఉన్న భగవంతుడు ఉన్నాడు.

వి : ఇద్దరు భగవంతులా ?

కృ : భగవంతు లిద్దరుకారు. ఒక్కడే. అధికారు లిద్దరు. రూపనామములున్న చిన్మయవిగ్రహమును చూచి ఆనందించదగినవారు. నిష్క్రియాత్మమైు రూపనామ ములులేని సచ్చిదానంద బ్రహ్మానుభవం కలిగి ఆనం దించ తగినవారు రెండు తెగలైన అధికారులున్నారు. ఈ రెండు విషయములనే సగుణమని నిర్గుణమని వాడ తారు.

వి : అంటే ఒక్కడే రెండు స్వరూపములుగా వర్ణించబడ తాడన్నమాట.

కృ : అవును.

వి : ఎప్పుడు సగుణుడౌతాడు ?

కృ : సృష్టిలేని సమయంలో నిర్గుణం. సృష్టిరావాలంటే సగుణం కావాలి.

వి : ప్రకృతంలో మనం ఎవరిని ఆశ్రయించాలంటారు ?

కృ : మనం అంటే ?

వి : నేను.

కృ : అల్లా అను. జ్ఞానయోగ సాధనలో నిర్గుణ బ్రహ్మను; యీ యోగంలో సగుణమును ఆశ్రయించాలి.

వి : ఎందువల్ల నంటారు ?

కృ : భక్తిలో సేవింపబడేవాడు, సేవ అని మూడు విషయాలున్నాయి. ధ్యాత, ధ్యానము, ధ్యేయము దీనినే త్రిపుటి అంటారు. ఆత్మజ్ఞానసాధనలో యీ త్రిపుటి పోవాలి. కాబట్టి ధ్యేయమైన వస్తువు గుణమయం కావాలి. అందుకని భక్తియోగంలో సగుణ భగవంతుడే అవసరం.

వి : జీవుడు సేవించేవాడు, ఈశ్వరుడు సేవించబడేవాడు ఇంతేగదా ?

కృ : అవును.

వి : జీవేశ్వరులకు భేదమెల్లాంటి దంటారు ?

కృ : మాయాప్రతిబింబితుడై మాయను తన స్వాధీనంలో ఉంచుకుని తన స్వాతంత్ర్యంపైన ఉపాధిని కల్పించుకుని సర్వజ్ఞుడై సర్వేశ్వరుడై విరాజిల్లుతూ చేతనాచేతనమైన ప్రపంచమునంతను పరిపాలిస్తుతూ జీవుల కోరికలను నెరవేర్చుతూ ఉంటాడు ఈశ్వరుడు. ఇతడు

జగత్తునంతా వ్యాపించి పరిపాలించుతాడు కనుకనే ఈతనికి ఈశ్వరుడని పేరు వచ్చింది.

జీవుడల్లాకాదు. అవిద్యా కామకర్మలకు వశుడై అస్వతంత్రుడై కర్మబంధములతో బంధించబడి సంసారదుఃఖమును అనుభవించుతూ పరిమిత స్వరూపుడై ఉంటాడు. కావుననే జీవుడు ప్రథమంగా ఆ యీశ్వరుని ఆరాధించి భక్తుడై అవిద్యాగ్రంథివిమోచనం చేసుకోవాలి.

వి : ఆత్మజ్ఞానమును ఈశ్వరుడే ప్రసాదించాలన్నమాట.

కృ : అవును. అంతర్యామిరూపంలో ఉండి జ్ఞానమును ప్రసాదించుతాడు యీశ్వరుడు. ఈ విషయమునే 10. అ-10, 11 శ్లోకములలో ప్రతిపాదించారు విను.

తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగంతం యేనమాముపయాంతి తే॥
అ-10. 10.

తేషామేవాను కంపార్థ మహమజ్ఞానజం తమః
నాశయా మాత్మభావ స్థోజ్ఞానదీపేన భాస్వతా॥ అ-10 11

తా॥ అర్జునా ! నాకు ఎవ్వరు నిరంతర సేవకులై ఉంటారో వారికి నేను ఆత్మజ్ఞానమును అందించుతాను. ఈ శ్లోకంలో బుద్ధియోగ అంటే ఆత్మజ్ఞానమని అర్థం. "బుద్ధి సమ్యగ్దర్శనం మత్తత్వ విషయం తేన యోగః బుద్ధియోగః" అని శంకరులు వివరించారు రెండో శ్లోకంలో తన భక్తులయొక్క అంతఃకరణాలో

ఉండి అజ్ఞానమనే చీకటిని పోగొట్టి జ్ఞానమనే దీపమును వెలిగించుతానని ప్రతిజ్ఞగా చెప్పారు. కాని ఒక్కమాట "సతత యుక్తానాం" అన్నారు. అంటే దారేషణ, ధనేషణ, పుత్రేషణలనే వాటిని వదలి ఆయననే సేవించేవారికని అర్థం.

వి : జ్ఞానదీపం అంటే ఏమిటంటారు ?

కృ : ప్రస్తుతము నీవు ఆత్మజ్ఞానం అనిమాత్రమే తెలుసుకో. జ్ఞానయోగంలోగాని ఆ సిద్ధాంత ధర్మములు బోధపడవు. చాలామంది యీ భక్తి ప్రపత్తులు లేకుండానే ఆత్మజ్ఞానమును అందుకోబోయి అక్కడ శాంతి కుదరక తికమకపడుతూ ఉంటారు.

వి : జ్ఞాని అయిన తరువాత భక్తి అక్కరలేదా అండి ?

కృ : తప్పు. అప్పుడుకూడా కావలసిందే. నిజానికి జ్ఞానిభక్తే గొప్పదికూడా. కొందరవివేకులు భగవంతుడను నేనే అయినాను యింకా భగవంతుడెవడు ? అని హుంకరించి అధఃపతనం అవుతూవుంటారు. ఈ విషయమునే వ్యాసులవారు భాగవత దశమస్కంధంలో వర్ణించారు."ఆరుహ్యకృచ్ఛ్రేణ పరం పదం తతఃపతంత్యధో నాదృతయుష్మదంఘ్రయః ॥

తా॥. దేవకీ గర్భంలోవున్న భగవంతుని స్తుతించుతూ స్వామీ ! చాలా కష్టపడి జ్ఞానసాధము నధిరోహించిన కొందరు అహంకారంతో నిన్ను వదలి అధఃపతనం చెందుతున్నారు అన్నారు. కాబట్టి జ్ఞానమంటే భక్తి హీనమని కాదు. పూర్ణభక్తి అని అనాలి.

వి : భక్తికి ప్రథమ సోపానం ఏమిటండీ ?

కృ : అంటే నాకు అర్థంకాలేదు.

వి : భక్తియోగమును సాధించదలచిన సాధకుడు ముందు దేనిని జాగ్రత్తపరుచుకోవాలి ? అని.

కృ : అల్లా అడుగు. ముందు మనస్సును స్వాధీనం చేసుకోవాలి. ఆ మనస్సుతో భక్తికి అంగభూతమైన సగుణ ధ్యానమును సాధించాలి. ఆధ్యానం కుదరాలంటే మనస్సు స్వాధీనం కావలిసిందే.

వి : పెద్ద చిక్కే తెచ్చారు. అక్కడేవుంది సాధకుని బాధంతా.

కృ : ఏమి భయమక్కర్లేదు. ప్రతి సాధకుడు మనస్సును నియమించటానికి అభ్యాసయోగమనే దాని నొక దానిని భగవానులందించారు.

వి : అదెక్కడుంది ?

కృ : గీతలోనే.

వి : గీతలో మూడేగదా ! యోగాలు ?

కృ : కాదు. స్థూలంగా మూడేయోగాలున్నా మూడు యోగములకు సమిష్టిగా అభ్యాసయోగముంది. కర్మ యోగంలో కాయిక వ్యాపారం ప్రధానంకాబట్టి శారీరకంగా అభ్యాసయోగం చెప్పారు. భక్తికి జ్ఞానమునకు మానసిక వ్యాపారం ప్రధానంకాబట్టి మానసికాభ్యాసయోగాన్ని వర్ణించారు. దీనినే ధ్యానయోగమంటారు.

వి : అయితే ధ్యానయోగ అభ్యాసయోగ పదములకు ఒకే స్థానం యివ్వవచ్చునన్న మాట.

కృ : ఆ.

వి : అభ్యాసయోగమనే మాట గీతలో ఉన్నదంటారా ?

కృ : లేకేమి ? 8 అ- 8 శ్లోకం, 12-అ 9. శ్లోకం. యీ రెండు శ్లోకములను చూడు. అక్కడ యీ పదం వాడబడింది.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషందివ్యం యాతి పార్థానుచింత
యన్ ॥ అ 8-7

శ్లో॥ అథచిత్తం సమాధాతుం నశక్నోషిమయిస్థిరం
అభ్యాసయోగేనతతో మామిచ్ఛాప్తుం
ధనంజయ.

తా॥ పై శ్లోకంలో అభ్యాసయోగం చేసేవారు పొందే ఫలమును వర్ణించారు. ఏమని ? అభ్యాసయోగంతో సిద్ధి బొందిన మనస్సుతో సూర్యమండలంలో అంతర్యామిగావున్న హిరణ్మయమూర్తిని ధ్యానించి, ఆ ధ్యానయోగి ఆ హిరణ్మయ పురుషస్థానమునే పొందగలడన్నారు. 12 అ. 9-లో విశ్వరూపంతో వెలుగొందే నా మూర్తిని నీ అంతఃకరణలో స్థాపించుకోవటం చేతకాకపోతే అభ్యాస యోగంతో నన్ను పొందవచ్చునన్నారు. చూచావా అభ్యాసయోగ పదమును ఎల్లా వాడారో.

వి : చిత్తం. అయితే యీ ధ్యానయోగమునకు లేదా అభ్యాసయోగమునకు అంగములేమిటంటారు ?

కృ : యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణలు, ధ్యానాంగములౌతాయి.

వి : ప్రాణాయామాన్ని గీతాశాస్త్రం ప్రధానంగా వర్ణించిందంటారా !

కృ : కొన్ని యజ్ఞములను వర్ణిస్తూ అందులో దీనిని కూడా ఒక యజ్ఞంగా వర్ణించింది.

"ద్రవ్యయజ్ఞాస్తపో యజ్ఞాః యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చయతయ స్సంశిత వ్రతాః"
4. అ. 28. శ్లో॥

వి : ప్రాణాయామం ప్రతివారికీ యీ రోజుల్లో సాధ్యం కాదనుకోండి అప్పుడేం చెయ్యాలంటారు ?

కృ : ప్రాణాయామమంటే హఠయోగులు చెప్పినట్లు పరిపూర్ణంగా దానినే ప్రధానం చెయ్యకుండా లఘువుగానైనా చెయ్యటం అవసరం.

వి : స్త్రీలుకూడా చెయ్యవచ్చునంటారా.

కృ : ఆ. కౌసల్య ప్రాణాయామం చేస్తూ పురుషోత్తముని ధ్యానించినట్లు రామాయణంలో వర్ణితమైవుంది.

వి : హఠయోగమంటే ?

కృ : పతంజలి మహర్షివారు యోగశాస్త్రమును రచించారుగదా? దానిలో వర్ణించి నిర్ణయించినదానికిహఠయోగమని పేరు.

వి : దానికాపేరు ఎందుకు వచ్చిందంటారు ?

కృ : హఠమనగా గట్టిపట్టు. బలాత్కారంగా మనస్సును వాయుపీడనంతో స్వాధీనం చేసుగోవటానికి హఠ యోగమని పేరు.

వి : ప్రస్తుతకాలంలో హఠంకాకుండా తేలికమార్గ మేమైనా ఉందంటారా ?

కృ : లేకేమి ! మహర్షులే కలియుగంలో జనులకు పూర్వ యుగములలోవలె శక్తులుండవని అనేక మార్గములను నిర్ణయించారు. ప్రాణాయామం చేతకానివారు జప యోగమును ప్రధానంగా చెయ్యవచ్చు. ఆ జప విధానంలోనే ప్రాణ వాయువు సంయమమై మనస్సు ఏకాగ్రం కాదగిన మార్గముంది. శ్రీకృష్ణులు కూడా జపమనే దానిని ఒకయజ్ఞంగా వర్ణించారు.

వి : ఎక్కడ ?

కృ : 10. అ. 25. "యజ్ఞానాం జపయజ్ఞోస్మి." దీనినే మంత్ర యోగమనికూడ అంటారు.

వి : దీనికి జపమనేమాట ఎందుకు వచ్చిందంటారు !

కృ : "జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశనః
తస్మా జ్జప ఇతి ప్రోక్తో జన్మపాపవినాశనః"

తా॥ జ అనే అక్షరం జన్మరాహిత్యాన్ని ప అనే అక్షరం పాపనాశనమును సూచించుతున్నాయి. కాబట్టి జన్మ పాపములనేవాటిని రెండింటిని నశింప చేస్తుంది కనుక దీనికి జపమని పేరు వచ్చింది.

వి : పూర్వయుగములలో కలియుగంలో వారికున్నంత చాంచల్యము మనస్సుకు ఉండేది కాదేమో !

కృ : సృష్టియొక్క స్వభావములు ఎప్పుడూ ఒక్కటే. ప్రతి దేశంలోను, ప్రతి కాలంలోను, ఏ వ్యక్తులయందైనా ఒక్కటిగానే ఉంటాయి. కాని దేశకాలముల ననుసరించి ద్రవ్యములందుండే శక్తులుమాత్రం తక్కువ ఎక్కువలతో ఉంటూ ఉంటాయి. మనస్సుకు ఎప్పుడూ చంచలమే స్వభావం. కావుననే అర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించారు మనస్సును అరికట్టటం దుష్కరముగదా అని.

వి : అర్జునునకే కలిగిందా ఆసందేహం? అబ్బా! అంతవానికే కలిగితే నాగతేఎంటి? అయినా ఏమన్నాడంటారు?

కృ : 6. అ. 34 శ్లోకం

చంచలంహి మనః కృష్ణ! ప్రమాధి బలవద్దృఢం
త స్యాహం నిగ్రహం మన్యే వాయోరివ
సుదుష్కరం.

తా॥ కృష్ణా ! మనస్సు అతి చంచలమైనది. వాయువు ఎల్లా చలనస్వభావం కలదో మనస్సుకూడా అల్లాంటిదేనని నా ఊహ. అని మనస్సుకుండే శక్తులను కూడా వివరించాడు. ఏమిటా శక్తులు ? "ప్రమాధి, బలవత్, దృఢం," ఒక పనినిచేస్తూ ఆపనిలో నిమగ్నమైవున్న శరీరమును ఇంద్రియములనుకూడా ఒక్క త్రుటిలో

కదిలించి, మరొక వైపుకు మళ్ళించే శక్తి మనస్సుకుంది. విక్షేపశక్తికి మనస్సే మందిరం. దానికిది మొదటికార్యం. అక్కడికి వెళ్ళిన దానిని మళ్ళీ మొదటిచోటికి మళ్ళించుదామంటే, దృఢం. ఆమనస్సునకున్న బలం ఎవరికుంది? "బలవత్, పోనీ దీన్ని ఇంతటితో ఛేదించుదామంటే ఛేదించటానిక్కూడా సాధ్యంకాదు. బాబోయి ! యీ మనస్సును నిగ్రహించటం ఎల్లాగో స్వామి ? అన్నారు.

వి : నాకింకా భయం వేస్తూందండి !

కృ : (వీపు చరిచి) ఏం భయపడకు. శ్రీకృష్ణులున్నారు గదా ! వారన్ని ఉపాయములను చెప్పారు. వెంటనే యీ సమాధానం చెప్పారు.

"అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే" 6. అ. 35 అర్జునుని మాటను నిజమేనని ఒప్పుకొని అభ్యాసము. వైరాగ్యము అనే శక్తులను నువ్వు సంపాదించితే మనస్సుయొక్క ప్రభావం నీ మీదికి రాదన్నారు. దీనినే యోగశాస్త్ర ప్రణేతయైన పతంజలి మహర్షి "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" అని సూత్రీకరించారు. అభ్యాస వైరాగ్యములతో మనస్సును నిరోధించమన్నారు.

వి : ఒక్క సందేహం. యీ సాధన భాగమును పతంజలి వారు కనిపెట్టిన దానిని శ్రీకృష్ణులు చెప్పారా ?

శ్రీకృష్ణులు నిర్ణయించిన దానిని పతంజలివారు నిర్ణయించారా ? వారికాలం వీరికాలం ఒక్కటా, రెండా ?

నువ్వు ఆ మాయా వ్యామోహంలో పడకు. ఆ మోహంలోపడే యీనాటి మన విజ్ఞానవేత్తలు ప్రజలను పెడదారులు పట్టించుతున్నారు. అసలు మన సిద్ధాంతములకు కాలనిర్ణయం లేదు. అన్ని విషయములు అనాదులై వెలసిన వేదములను ఆధారంగా చేసుకున్నవే. శ్రీకృష్ణుడైనా క్రొత్తగా చెప్పలేదు. యోగశిఖోపనిషత్తు, ధ్యానబిందూపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు మొదలైన ఉపనిషత్తులనుండి విషయమును సంగ్రహించి చెప్పారు. మన దర్శనకర్తలైనా వాటిని ఆధారంగా చేసుకునే చెప్పారు. పతంజలివారైనా అంతే.

చిత్తం. మనస్సును ఏకాగ్రం చెయ్యటానికే అభ్యాసం చెయ్యమన్నారే అభ్యాసం అనే మాటకు సరియైన తాత్పర్యమును నాకు బాగా అర్థమయ్యే విధంగా చెప్పాలి తమరు.

అల్లాగే. మనము మన మనస్సును భగవంతునియందు, లేదా జపం చేసేటప్పుడు ఆ మంత్ర వర్ణములమీద, లేదా, ఆ మంత్రార్థ భావనయందు, గట్టిగా పెట్ట దలచినప్పుడు ఆ ప్రదేశములను వదలి మరొక చోటికి చెదరి పోతుంటే ఆ పోయినచోటినుంచి మళ్ళీ మనం

ఉంచదలచిన చోటికి తీసుకువచ్చి పెట్టుకుంటూ ఉండాలి. అల్లా ఎన్నిసార్లు వెళుతూంటే అన్ని పర్యాయములు విసుగుపుట్టకుండా మరలించుతూంటే దీనికి అభ్యాసమని పేరు * అల్లా మరలించగా కొన్నాళ్ళకు మొదటిచోటే నిలుస్తుంది. పసిపిల్లవానిని బడికి పంపించే మొదటిరోజుల్లో అతడక్కడ నిలవడు దిద్దవలసిన అక్షరములను దిద్దడు. దిక్కులను చూస్తూ ఉంటాడు. అందుకని ఆ ఉపాధ్యాయుడు అతడిపైన ఒక కన్నువేసి ఉంచాలి. మాటిమాటికి వానిని కూర్చోపెట్టాలి. ఒకప్పుడు వానికి దిద్దటానికి ఆశను కల్పించాలి. మరొకప్పుడు గుడ్లు ఉరమాలి. అల్లాగే మనస్సునుకూడా బహిర్ముఖమై వెళుతూంటే అంతర్ముఖం చెయ్యాలి. దీనికే అభ్యాసమనిపేరు.

వి : సందర్భం వచ్చిందికనుక అడుగుతున్నాను. శంకరులు యోగ సిద్ధాంతమును ఖండించారని, ఆ యోగ సిద్ధాంత మక్కరలేదన్నారని కొందరు చెప్పగా విన్నాను ఏమిటది? పైగా యోగాభ్యాసం మహిమల కేననికూడా వెక్కిరించేవారున్నారు.

కృ : శంకరులు ఖండించింది అసలు యోగులు చెప్పిన ప్రాణాయామాదికములను కాదు. ఆ యోగులు చెప్పే సమాధిస్థితియే మోక్షంకాదన్నారు. ఆ యోగ

---

* శంకరభాష్యం. చిత్తస్య ఏకస్మిన్నాలంబనే సర్వతః సమాహృత్య పునః పునఃస్థాపనం అభ్యాసః.

దర్శనమందున్న సాధనలనన్నింటిని సాధకుడు అవలం బించ వలసినదే నన్నారు. అద్వైత వేదాంతమును చక్కగా సంప్రదాయ పూర్వకంగా అర్థంచేసుకో కుండా పెడదారులు పట్టించే సోమరిపోతులు కొంద రున్నారు. వారు విగ్రహారాధన అక్కరలేదని, భక్తి అంటే క్రిందిమెట్టని, స్నానశౌచములనేవి అక్కర లేదు. జ్ఞానం కుదిరితే చాలు జపతపములన్ని అజ్ఞాన మనే శంకరుల వాణిగా చెప్పి, తమ అలసత్వమును జిహ్వోపస్థల చాంచల్యమును శాస్త్రమర్యాదా రూపంలో వాడుతూ ఉంటారు అది తప్పు. శంకరులు సాధకునకు చిత్తపరిపాకం కలిగిన తరువాత ఆత్మమన నమును చెప్పారు అంతే. భక్తి ఆ జ్ఞాననిష్ఠకు సాధన మనే నిర్ణయించారు. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ" అనికూడా వారు సిద్ధాంతీకరిం చారు. చంచలమైన మనస్సును స్థిరీభూతంగా చెయ్యా లంటే ఆ భగవంతుని పాదపద్మముల దగ్గర ఉంచాలని దీనిని ఒక కోతిగా వర్ణించి, యీ కోతిని భక్తియనే త్రాటితో కట్టి కపాలం పుచ్చుకొని బిక్షుకుడై చరించే యీశ్వరునకు వప్పచెప్పారు శంకరులొకచోట.

వి : ఆహా ! ఎక్కడండి వారీ భావాన్నిచ్చింది ?

కృ : శివానందలహరిలో యీ కోతిచేసే పనులను వర్ణించి స్వామీ నీకు వప్పచెబుతున్నానన్నారు.

వి : ఆ శ్లోకం పఠించాలి.

కృ : శ్లో॥ సదా మోహాటవ్యా మటతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝడితి స్వైర మభితః
కపాలిన్ భిక్షో మేహృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బధ్వా శివ భవదధీనంకురు విభో॥

ఈ మనస్సనే కోతి మోహమనే అడవిలో తిరుగుతోందిట. దానికి అడవిలో చెట్లొక్కటేకాదు పర్వతాలుకూడా సంచార ప్రదేశాలేగా. అందుకని యువతుల పాలిండ్లనే పర్వతాలమీద గంతులు వేస్తోంచన్నారు. కోతికొమ్మచ్చు ఆట అంటారు తెలుసానీకు ? అంటే చెట్ల కొమ్మలమీదనే ఒక కొమ్మనుండి మరొక కొమ్మ మీదికి దూకటం. అల్లా ఆశలనే కొమ్మలమీద దూకుతోందిట. అల్లాంటి కోతిని బంధించాలంటే భక్తిఅనే త్రాడే కావాలన్నారు.

వి : శంకరులు ఈశ్వరుని భిక్షో అన్నారేమిటి? గౌరవంగా పిలవకుండాను ?

కృ : అందులో ఒక అందముంది. భిక్షుకుడు కోతిమెడకు త్రాడుకట్టి దానిని ఆడించుకుంటూ అడుక్కుంటాడు. ఆ కోతి వాడికెల్లా విలాసంగా ఉంటుందో ఈశ్వరుడు కూడా మనస్సనే కోతిని అల్లా విలాసంగా త్రిప్పుతాడని భావం. కోతిని ఆడించేటప్పుడు హే ఈశ్వరా! అంటే ఏం బాగుంటుంది ! రాజుగారు కోతిని పుచ్చుకుని తిరుగుతాడా ? మనస్సును జయించిన వాడు

కనుక ఈశ్వరుని దివ్యత్వాన్ని యిందులో వర్ణించారు. శంకరులవారి అదొక అమృత సరస్సు.

వి : ఓహో ! హో ! అయితే సామాన్య సాధకుడు కుంభక ప్రాణాయామాన్ని చెయ్యలేని పక్షంలో జపయోగాన్ని సాధనగా గ్రహించగా ఆ జపయోగంతోనే మనస్సు కట్టుబడుతుందంటారు ?

కృ : అవును. ఆ జపం మూడు విధాలుగా ఉంటుంది. వాచికము, ఉపాంశు మానసికము అని. కొంచెం ధ్వని కలిగి మంత్రమును ఉచ్చరించితే అది వాచికజపం. మంత్రవర్ణములు ధ్వనిరహితంగా ఉచ్చరింపబడుతూ పెదవులు మాత్రం కదులుతూ జపంచేస్తే అది ఉపాంశు. పెదవులుకూడా కదపకుండా మనస్సులోనే మంత్రవర్ణములను పలుకుతుంటె అది మానసికం. ఆ మానసికజపంలో శ్వాస ప్రశ్వాసలు కొంత నిరుద్ధమౌతాయి. అల్లా క్రమంగా ప్రాణాయామం సిద్ధించుతుంది. కాని కొంత దీర్ఘకాలం చెయ్యాలి. కుంభకమును చెయ్యటం తీసివేస్తే పతంజలి చెప్పిన మిగిలిన సాధనలన్ని జపయోగంలోకూడా కావలసిందే. వాటి నన్నిటిని గీతలో శ్రీకృష్ణులుకూడా వర్ణించారు.

వి : జపమునకు మంత్రగ్రహణం ప్రధానంగదా ? అసలు మంత్ర శబ్దమునకు అర్థమేమిటో ?

కృ : మననంవల్ల రక్షించుతుంది కనుక మంత్రమైంది.

శ్లో॥ "మకారం మననం ప్రాహుః త్రకారస్త్రాణముచ్యతే,
మననత్రాణసంయుక్తో మంత్ర ఇత్యభిధీయతే."

ఈ జపయోగమునే మంత్రయోగమనికూడా వాడతారు. మరొక అర్థంకూడా ఉంది. మకారము జీవుడు. త్రకారము పరమాత్మ లేక ఆత్మ ఈ రెంటి ఐక్యమే మంత్రమనికూడా ఉంది. కాని సాధన భాగంలో మంత్రాధిష్ఠానదేవత జీవునికి సాపక్షయంచేసి, ధ్యాన రక్షణను కల్పించుతుందనే అర్థమే అవసరం.

వి : మంత్రానుష్ఠానంలో ఋషి, ఛందస్సు, బీజము, కీలకము, శక్తి, అంగన్యాస కరన్యాసములు ఉన్నాయిగదా ! వీటికేమైనా సంజ్ఞలున్నాయా ?

కృ : ఉండకుండా ఎందుకుంటాయి ? ఏ ఋషి ఏ మంత్రమును అనుష్ఠించి సిద్ధుడైనాడో అతడు ఆ మంత్రమునకు సృష్టికర్త, పాలకుడు అవుతాడు. కేవలము మంత్రమునకేకాదు. మంత్రసిద్ధుడు సృష్టిని, సృష్టమైన జగత్తునుకూడా పాలించగలడనికూడా శాస్త్రం చెబుతుంది. ఎందువల్ల అతడంత శక్తుడౌతాడంటే మంత్రమనగా శబ్దబ్రహ్మము. జగత్సృష్టికి హేతుభూతమైనది శబ్దమేనని శబ్దబ్రహ్మవాదుల నిర్ణయం. ఎవ్వడు ఏ మంత్రమును ఉపాసించుతాడో ఆ మంత్రాధిష్ఠానమైన దేవతతో తాదాత్మ్యమునొందగల అపూర్వ శక్తి ఉపాసకునకు వస్తుంది ఉపాసనాకాండలోని

కొన్ని నియమములననుసరించి. అందుచేత మంత్రో పాసనా సిద్ధివహించిన ఋషిసిద్ధుడుగా వ్యవహరింప బడతాడు. ఆతనికి లేనిశక్తి అంటూలేదు. హఠ యోగులుచెప్పే అణిమాది సిద్ధులుకూడా మంత్ర సిద్ధునకు రావచ్చు.

వి : అల్లాంటి సిద్ధులు యీ రోజుల్లో ఉన్నారంటారా ?

కృ : ఈ రోజుల్లో కనపడనిదల్లా లేదని సిద్ధాంతమా ?

వి : కాదు లెండి. ఊరికే విషయమడిగాను.

కృ : మనం చరిత్రల్లో చెప్పుకునే మహానీయులంతా మంత్ర సిద్ధులే. మంత్రానుష్ఠానమును ఎల్లా చేయమని ఆ మంత్రశాస్త్రం చెప్పిందో అల్లా తు. చ. తప్పకుండా అనుష్ఠించిన అనుష్ఠాతలు వారు. అందువల్ల మంత్రాధి దేవతను వారు వశంచేసుకోగలిగారు. కాళిదాసు గారిని గురించి కాళికాదేవి పలికిన పలుకును పెద్ద లంతా చెబుతూఉంటారు విన్నావా ?

వి : ఏమిటండది ?

కృ : ఒకప్పుడు దండి, భవభూతి, కాళిదాసుగారు, భోజ మహారాజుగారి కోరికపైన వక వర్ణనం చేశారు. దానిని రాజుగారు విని కాళిదాసుగారి వర్ణనం బాగు న్నదని ప్రశంసించారు. అది హైవారిద్దరు ఒప్పుకో లేదు. ముగ్గురు ఉపాసకులేకనుక అమ్మవారినే తీర్పు యివ్వవలసిందిగా కోరారు. అమ్మవారు ఇల్లా అందిట

శ్లో॥ కవిర్దండీకవిర్దండిః భవభూతి స్తు పండితః ॥

అని అంటే దండి కవీశ్వరుడు, భవభూతి పండితుడు కూడాను అంది. ఆ సందర్భంలో కాళిదాసు మాట లేదుగదా ! ఆ-తలో కాళిదాసుగారు నేనెవరినమ్మా అన్నారు. "త్వమేవాహం త్వమేవాహం, త్వమే వాహం నసంశయః॥ నీవే నేను అని ముమ్మార్లు పలి కింది అమ్మవారు. ఇల్లా మంత్రసిద్ధులు ఎందరో ఉన్నారు. త్యాగరాజు, పోతన, శ్రీనాధుడు, వీరం దరు మంత్రసిద్ధులే.

వి : అవును. కాని వారు సృష్టికర్తలా ?

కృ : వాఙ్మయ సృష్టికర్తలుగదా ? మంత్రసిద్ధులగు వారి ముఖమునుండి వెడలివచ్చెడి వర్ణములు సృష్టి స్థితి లయములను మూడింటిని చేయగలవు. అందుకే కవికి బ్రహ్మ అనిపేరు. వ్యాస వాల్మీకులు లేకపోతే మనకీ విజ్ఞానమెల్లా వస్తుంది ? అందుకే దండిమహా కవి శబ్దమును జ్యోతి అన్నారు.

వి : చిత్తం. అయితే మరి మంత్రములలో ఏ మంత్రమును అనుష్ఠించాలంటారు ?

కృ : ఏ మంత్రమైనా ఒక్కటే ఏడుకోట్ల మహామంత్రము లున్నవి. చేసే కర్తయొక్క బలమునుబట్టి ఏ మంత్ర మైనా ఏ మంత్రాధిష్ఠానదైవమైనా మనకు కావల సిన వినిర్మల మనస్సును ప్రసాదించుతుంది.

వి : మన భగవద్గీత ఏ మంత్రమును బోధించిందంటారు ?

కృ : ఫలానా మంత్రమని గాని, ఫలానా మూర్తియనిగాని నిర్ణయించలేదు గీతాశాస్త్రం. ఎవడు ఏ తనువును అధిష్ఠానంగా పెట్టుకున్నాసరే అన్నది.

"యోయోయాంయాం తనుం భక్తశ్రద్ధయార్చి
తుమిచ్ఛతి ।
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహం॥
7. అ. 21 శ్లో॥

వి : ఒక మంత్రమును జపించి, ఆ మంత్ర దేవతయొక్క అనుగ్రహమును పొందాలంటే ఏం చెయ్యాలంటారు ?

కృ : మంత్రయోగులు మంత్రసిద్ధికి పదహారు అంగము లున్నాయన్నారు. ఆ పదహారు అంగములతోను మంత్రానుష్ఠానంచేస్తే షోడశ కళాపరిపూర్ణమైన చంద్రమండలంవలె ఆ మంత్రసిద్ధి పూర్ణరూపమును ధరిస్తుందని వారి నిర్ణయం.

1. భక్తి. ఇది లేనిదే యే యోగము లేదుగదా ?

2. శుద్ధి. శుద్ధి అనేది ప్రతిదానికి కావాలి. మనం తినే పదార్థానికి ఎల్లా శుద్ధి కావాలో అల్లాగే మంత్రయోగానికికూడా శుద్ధి ఉండాలి. ఈ రెండవదైన శుద్ధి కొన్ని భేదములు కలిగివుంది.

శుద్ధిభేదములు :- 1. దిక్శుద్ధి, 2. స్థానశుద్ధి, 3. స్నానశుద్ధి, 4. మనశ్శుద్ధి.

1. దిక్శుద్ధి అనగా ఏ దిక్కుకు తిరిగి జపంచేస్తే జప సిద్ధి కలుగుతుందో ఆ దిక్కుకు అభిముఖంగా కూర్చొని జపించుట.

2 స్థానశుద్ధి అనగా ఏ ప్రదేశంలో కూర్చొని జపించితే శీఘ్రంగా మంత్రసిద్ధి కలుగుతుందో ఆ స్థానములందు మంత్రానుష్ఠానమును చేయుట.

వి : భూమి అంతా ఒకటే గదా? ఎక్కడ కూర్చుంటే నేమి?

కృ : అల్లాకాదు. భూమికికూడా సత్వరజస్తమో గుణములున్నాయి. దివ్యక్షేత్రములలో చేసే జపం కోటి గుణితమౌతుంది. ఆవులను కట్టివేసే ప్రదేశంలో చేసే జపం నూరురెట్లుగా ఫలించుతుంది. కాబట్టి సత్యక్షేత్రములు ప్రశస్తం. అందుకే గోమయంతోనైనా శుద్ధి చేసిన ప్రదేశం మనకు కావాలి.

3. స్నానశుద్ధి అనగా మంత్ర పూర్వకంగా స్నానం చేయటం.

4. మనశ్శుద్ధి. దీనికే ఆచమనము, మంత్రపూతమగు ఉదకమును పుచ్చుకొనుట.

ఇక్కడికి శుద్ధి అనే రెండవ అంగములోని నాలుగు భేదములనుచెప్పాను. మంత్రాంగములలో మూడవది ఆసనం. దర్భాసనం, కృష్ణాజినం, వస్త్రాసనం మొదలైనవి.

నాల్గవది పంచాంగ సేవనం. పంచాంగ సేవనమంటే మంత్రము అయిదు అంగములతో ఉంటుంది. గీత, సహస్ర

నామము, స్తోత్రము, కవచము, హృదయము వాటితోకూడా మంత్రమును అనుష్ఠించటం పంచాంగ సేవనం.

అయిదవది ఆచారం. అంటే మంత్రాధిష్ఠాన దేవతను పూజించటం వేదోక్తంగా గాని, ఆగమంగా గాని, పౌరాణికంగా గాని కావచ్చు.

ఆరవది ధారణ. ఆ మంత్రమునకు అనుగుణ్యమైన అంటే ఆ మంత్రధ్యాన శ్లోకంలో వర్ణితమైన మూర్తిని మనస్సులో నిలపటానికి భావించటం.

ఏడవది దివ్యదేశ సేవనం. మనం అనుష్ఠించే మంత్రాధిష్ఠాన దేవతను స్థాపించే ప్రదేశమునకు దివ్యదేశమని పేరు. కలశంమీద ఆ మూర్తిని ఆవహించి పూజించవచ్చు. లేక యంత్రముమీద చెయ్యటంకూడా యుక్తమే. ఈ రెంటిని ప్రతివారు భావనా ప్రదేశములనుగా చెయ్యలేకపోతే రాతివిగ్రహం గాని, లోహ విగ్రహంగాని, పటంగాని పెట్టుకోవచ్చు.

ఎనిమిది ప్రాణక్రియ. అనుష్ఠాత పూజించ దలచిన ప్రతిమలకు ప్రాణశక్తిని కల్పించటానికై చేసే ప్రాణ ప్రతిష్ఠాపనా విధానమునకు ప్రాణక్రియ అనిపేరు. ఈ విధానంతో ఆ ప్రతిమలు చైతన్యము కలవౌతాయి.

వి : శిలాది విగ్రములకు ప్రాణం వస్తుందంటారా ?

కృ : ఆ మంత్ర శాస్త్రప్రకారంగా చేస్తే జడములు చేతనము లౌతాయి. దేవాలయము లందలి మూర్తులు

చేతనము లన్నమాట. వాటికి ఏరోజునను ఉద్వాసన చెప్పరు. మన యింటిలోవున్న మూర్తులకు ఆ రోజు పూజ కావటంతోటే ఉద్వాసన చెబుతారు. మంత్ర శక్తిని ధారవోయటంతో యంత్రం పనిచేస్తుంది.

వి : వర్ణోచ్చారణ కంత శక్తి ఉన్నదన్నమాట.

కృ : మరి వర్ణోచ్చారణేకదా ఎదుటివారి హృదయములకు ఆనందమును కల్పించినా క్రోధమును కల్పించినా శోకాదులను కల్పించినా ? తిట్టటానికి వర్ణములే దీవించటానికి వర్ణములే. కాబట్టే వర్ణసమామ్నాయ మును పరమాత్మ స్వరూపమని శాస్త్రములు చెబు తున్నాయి.

తొమ్మిదవది ముద్ర. ఏ చేష్టతో ఆ దేవతకు సంతోషం కలుగుతుందో ఆ చేష్టకు ముద్ర అని పేరు. శంఖ ముద్ర, యోనిముద్ర, సురభిముద్ర మొదలైనవి.

పదియవది తర్పణం.- జపం జరిగిన సంఖ్యలో పదవ వంతు క్షీరంతోగాని, జలంతోగాని తర్పణం చెయ్యాలి.

పదకొండవది హవనం. ఆ దేవతకు ప్రీతికరమైన పదార్థంతో హోమం చెయ్యాలి.

పన్రెండవది బలి. ఇది హోమార్హములైనపదార్థాలతో ఇస్తారు. నైవేద్యమని చెప్పవచ్చు.

పదమూడు యాగం. పదునాలుగు జపం. పదిహేను ధ్యానం. పదహారు సమాధి. ఇది మంత్రయోగం. అంటే

మంత్రోపాసనద్వారా భగవంతునిఅనుగ్రహమును పొందటం. ఈ విధంగా మనస్సును ఏకాగ్రం చేయటం సాధ్యమౌతుంది. మనస్సును ఏకాగ్రత చేయటం ఎల్లాగనే సమస్యను గురించి మనం మాట్లాడుతున్నాం.

వి : అవును. కేవలము కుంభక ప్రాణాయామం లేక పోయినా మానసికంగాచేసే మంత్ర జపంతో మనస్సును స్వాధీనం చేసుకొనవచ్చును అని తేలింది. అయితే జపంచేసుకొనే సమయంలో పాటించవలసిన కొన్ని నియమాలనుకూడా కొంత విస్తరించి చెప్పాలి తమరు.

కృ : అలాగే. రేపు చెబుతాను. ఈరోజుకు భగవన్నామంతో ముగించుదాం మన గోష్ఠిని.

వి : చిత్తం. కాని నాకు కీర్తనలేమీ రావు మరి.

కృ : కీర్తనలక్కరలేదు. ఒక్కమారు కన్నులను మూసి ప్రశాంతమైన వాఙ్మయంతో మనస్సును సంబోధించు.

వి : అయితే తమరే ఆ సంబోధించదగిన శ్లోకమును శెలవివ్వండి.

కృ : అలాగే.

"నిత్యానంద రసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతం

శంభుధ్యాన సరోవరం వ్రజమనోహంం సావతంస స్థిరం
కిం ? క్షుద్రాశ్రయ పల్వాల భ్రమణ సంజాత శ్రమం
ప్రాప్స్యసి.

వి : ఈ శ్లోక తాత్పర్యం తెలవివ్వాలి.

కృ : మనస్సుతో చెబుతున్నారు శంకరులు. ఓ మనస్సనెడి రాజహంసమా ! నీచములైన విషయములనే బురద గుంటకు వెళ్ళకు. భగవద్ధ్యానమనే చక్కని సరస్సున్నది. అందులో విహరించు. అందున్న వినిర్మలోదకములు ఎండిపోనివి. అవి ఆనందమే స్వరూపంగా గలిగి ఉంటాయి. అతిస్వచ్ఛమై నిత్యానందరసమనే ఆ జలంలో ముని దేవతాబృందములయొక్క అంతఃకరణములనే కమల షండములున్నాయి. సాధుపుంగవులెప్పుడూ అందులో మునకులిడుతూ ఉంటారు. ఆ ధ్యానసరస్సు సద్వాసనలతో గూడినవిర్మలోదకములను అందించటంతో నీలో నిండి నివాసించిన పాపం కిలమంతా పోయి దోషరహితమైనదానవై ఆత్మ రాజ్యమును ఏలగలుగుతావు అన్నారు.

వి : ఆ మహాభాగ్యం నాకెప్పుడో !!

కృ : నీ అభ్యాసయోగం పరిపూర్ణం ఎప్పుడో అప్పుడు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

—: రెండవరోజు :—

# జపయోగము

కృష్ణానందవిజయు లిద్దరు గోష్ఠికి అభిముఖులైనారు. విజయుడు అభివాదనంచేసి కూర్చుంటే ఆశీర్వాదపురస్సరంగా గోష్ఠికి అనుజ్ఞ యిచ్చారు కృష్ణానందులు.

వి : స్వామీ ! జాపకుని ప్రథమకర్తవ్యం ఏమిటంటారు ?

కృ : గురువులవలన మంత్రగ్రహణమును చెయ్యటం ప్రథమ కర్తవ్యం.

వి : మంత్రములు చాలా ఉన్నాయిగదా ? ఏ మంత్రం గొప్పదంటారు ?

కృ : అన్ని మంత్రములు గొప్పవే. మనకు వాఙ్మయంలో ఉన్న ఏబది వర్ణములు భగవత్స్వరూపములే. సాధకుని భావనా బలముననుసరించియే మంత్రమునకున్న ప్రభావం వ్యక్తమౌతుందిగాని, ఎంత మహత్తర మంత్రరాజమైనా సాధకుడు శక్తిహీనుడై ఏకాగ్రతా బలంలేనివాడైతే ఆ మంత్రప్రభావంకూడా బల హీనంగానే కనబడుతుంది.

వి : అల్లా అయితే యిన్ని మంత్రములు ఎందుకు వచ్చాయంటారు ?

కృ : సాధకుల సంస్కారములు బహుముఖములు కావటంతో వారి వారి సంస్కారముల కనుగుణ్యాంగా మంత్రమూర్తులుకూడా బహుముఖములై విస్తరిల్లి

నాయి. జాపకుడేమంత్రమును గ్రహించినా ఆ మంత్ర వర్ణములను, ఆ మంత్రరాజము నుపదేశించిన గురువర్యులను, మంత్రాధిష్ఠాన దైవమును ఒకే స్వరూపముగా భావించి గౌరవించాలి. అట్టివానికేమంత్రమైనా ఒక్కటే.

వి : మంత్రము, ఆ మంత్రముచేత ఉపాసించబడే మంత్రమూర్తి, గురువు, యీ ముగ్గురికి భేదం లేదంటారు. అంతేనా ?

కృ : అవును. జపయోగమంతా శబ్దంపైనా శబ్దార్థభావనపైనా ఆధారపడిఉంటుంది. శబ్దార్థములకు సత్యంలో భేదంలేదు. గురువుకూడా ఆ రెంటిలోవాడే.

వి : ఒక్కమాట. జపానికి కూర్చుని ఆ మంత్రవర్ణములను వాక్కుఉచ్చరించుతుంటే మనస్సు ఎక్కడకో పరుగెత్తుతుంది. ఆ మనస్సు అల్లా పరిగెత్తకుండా ఏం చెయ్యాలంటారు ? సామాన్యంలో చెప్పండి.

కృ : అల్లాగే చెబుతాను. సామన్యునికొరకే శాస్త్రం ప్రవర్తించింది. అజ్ఞునకు విజ్ఞునకు శాస్త్రం అక్కరలేదు. జిజ్ఞాసువుకే శాస్త్రం కావాలి. శాస్త్రం స్వేచ్ఛను అరికడుతుంది. అది నీ కిష్టమేనా ?

వి : చిత్తం ! మరి మీరు శాస్త్రం లేకుండా మాట్లాడరు గదా ?

కృ : శాస్త్రం లేకుండా నా అనుభవం అంటూ మాట్లాడే వారు చాలామంది ఉన్నారు నే నెందుకు ?

వి : వారి అనుభవమే శాస్త్రం కాగూడదా అండీ ?

కృ : అనుభవము శాస్త్రం కాగూడదు. శాస్త్రమును అనుభవానికి తెచ్చుకోవాలి. పెద్దలు చెప్పే అనుభవానైనా శాస్త్ర సిద్ధాంతం అయితేనే పరిగ్రహించాలి.

వి : అల్లాగే ఇప్పుడు మనస్సును చెప్పినట్లు వినిపించాలంటే ఏం చెయ్యాలంటారు ?

కృ : ముందు ఆహారమును సంయమనం చెయ్యాలి.

వి : సంయమనం అంటే ఏమిటండీ ?

కృ : నిగ్రహించటం. పదే పదే ప్రతిపదార్థంమీదికి పరుగులెత్తే మనస్సును శాస్త్ర నిషిద్ధపదార్థముల మీదికి పోకుండా చేసి పరిమితంగా భుజించటం.

వి : పదార్థ భక్షణకు మనస్సుకు సంబంధం ఏమిటి?

కృ : మనం తినే అన్నంతోనే మనస్సు తయారవుతుంది. అందుకనే ఏ యోగమును సాధించే సాధకుడైనా అన్నమును ప్రధానంగా చేసుకునే సాధన భాగాన్ని సాధించాలి. గీతలో చూడు.

"నాత్యశ్నతస్తుయోగోస్తి నచైకాంత మనశ్నతః"

అ. 6. శ్లో॥ 16

నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతి దుఃఖహా॥

అ. 6. శ్లో॥ 17

తా॥ అత్యంతముగా భుజించినా, అసలు ఉపవాసములను చేసినా, అతిగా నిద్రించినా అసలు నిద్రలేకపోయినా యోగం సిద్ధించదన్నారు. యుక్తమైన ఆహార విహారములు, యుక్తమైన చేష్టలు, తగిన నిద్ర, మితముగా మేల్కొనుట యోగసిద్ధికి హేతువులు.

వి: భోజనంలోకూడా మనకు స్వేచ్ఛలేదంటారా?

కృ: దేనిలోను లేదు. అతిగా తిన్నా అజీర్ణంతో జపం సాగదు. ఆకలితోను జపం సాగదు.

వి: అయితే అన్నం ఎంత తినాలంటారు?

కృ: పప్పు, కూర మొదలైన పదార్థములును అన్నము కలుపుకుని సగభాగం తినాలి. ఒకవంతు నీరును త్రాగాలి. అక్కడకు మూడువంతులైంది. నాల్గవ వంతు వాయుసంచారానికి ఖాళీ ఉండాలి. ఇది యోగశాస్త్ర నిర్ణయం.

వి: కృష్ణుని రోజులకే యీ ఆరోగ్యశాస్త్రానికి స్థానమొచ్చిందన్నమాట.

కృ: కృష్ణుడు అవతరించటానికిముందే ఆ శాస్త్రములు పుట్టాయి. వాటి తరువాతే కృష్ణుడొచ్చాడు. ఇప్పుడు శ్రీకృష్ణులు చెప్పిన ఆహారవిషయం శతపథ బ్రాహ్మణంలోని మంత్రమునకు అనువాదం. *

---

* యదుహవా ఽఽత్మ సంమితమన్నం తదవతి తన్న హినస్తి యద్భూయో హినస్తి తద్యత్కనీయోన్నం నతదవతి.

వి : విహారం అంటే ?

కృ : విహారం అంటే నడక. నడక ఎక్కువగా నడిచినా అలసట కలిగి జపానికి భంగం వస్తుంది. నిద్రాదులు కూడా అంతే.

వి : యోగశాస్త్ర ప్రణేతయైన పతంజలి యేకాలంలో వాడండి.

కృ : నాకా కాల నిర్ణయాలు తెలియవు. ఎవరు ఏకాలంలో వాళ్లో మనకెందుకు ? మన విజ్ఞానమంతా అనాది. భారతీయ సిద్ధాంతంలో సృష్టి అనాది. అలాగే జీవుడు. ఆతనిని నడిపించెడి కర్మవాసనలుకూడా అనాదులే. ఈ జీవుడెప్పటినుండి సంసార గహ్వరంలో ఉన్నాడో ఎవ్వరికీ తెలియదు. అది తేలని ప్రశ్న. అందుకని కేవలము కవికాలమును గూర్చిన విమర్శ ఆయుర్దాయాన్ని హరించటంకంటే వేరే ఫలాన్నేమీ యివ్వదని నా ఊహ. నిజానికీనాడు కాళిదాసు కాలాన్ని ఎవరు నిర్ణయించ గలిగారు ? వివాదాస్పదంగానే ఉంది. తరువాత అడుగు.

వి : పతంజలివారు యోగశాస్త్రమునేనా ఇంకా ఇతర శాస్త్రములనుకూడా చెప్పారా ?

కృ : యోగశాస్త్ర మొక్కటేకాదు. వైద్యశాస్త్రమును, వ్యాకరణ శాస్త్రమునుకూడా రచించారని శిష్టసూక్తి.

శ్లో॥ యోగేనచిత్తస్య పదేనవాచాం
మలంశరీరస్య చ వైద్యకేన

యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజరిరానతోస్మి॥

యోగశాస్త్రంతో చిత్తమలమును, వైద్యశాస్త్రంతో శరీర మలమును, వ్యాకరణ శాస్త్రంతో వాక్కుయొక్క మలమును పోగొట్టినారని పై శ్లోకానికి అర్థం.

వి : ఆహా ! ఎంత మహానుభావుడు? యోగశాస్త్రమంతా మన స్తత్వంపైన ఆధారపడిందన్నమాట.

కృ : అవును. సూక్ష్మశరీర శోధనమే యోగశాస్త్రప్రయోజనం.

వి : పతంజలి మహర్షి వారి శాస్త్రమును మన మెంతవరకు వాడుకోవచ్చు నంటారీ రోజుల్లో ?

కృ : పతంజలి యోగదర్శనములో సాధన పాదాన్ని ముఖ్యంగా గ్రహించాలి.

వి : అసలెన్ని పాదాలు ?

కృ : నాలుగు పాదాలు. 1. సమాధిపాదం, 2. సాధన పాదం, 3. విభూతిపాదం, 4. కైవల్యపాదం. ఈ నాలుగు పాదాల్లోను 195 సూత్రాలున్నాయి.

వి : దీనికి వ్యాఖ్యాతలున్నారా ?

కృ : వ్యాసభాష్యం ఉంది. ఆ భాష్యమునకు వాచస్పతి మిశ్రుల టీకవుంది. సూత్రములకు భోజవృత్తికూడా వుంది.

వి : ఒక్క మనవి. అసలు మనస్సు బహుముఖములుగా చరించుతూ ఉండటానికి కారణమేమిటంటారు ?

కృ : సత్వరజస్తమో గుణముల పరిణామమే దానికి కారణం.

వి : ఒక్కొక్క గుణం ప్రవృద్ధమైనప్పుడొక్కొక్క పరిణతిని పొందుతుందన్నమాట మనస్సు.

కృ : అవును. ఈ విషయమును యోగదర్శన వ్యాఖ్యాతలు వివరించారు. మనస్సునకు అయిదు అవస్థలున్నాయి. 1. క్షిప్తము, 2. మూఢము, 3. విక్షిప్తము, 4. ఏకాగ్రము, 5. నిరుద్ధము అని.

రజోగుణం ఉద్రేకించినప్పుడు చిత్తము బహిర్ముఖమై తనకు దగ్గరలోగాని దూరంగాగాని ఉన్న సుఖదుఃఖములతో మునకలు వేస్తూ మనం చెయ్యదలచిన మంత్ర జపంపైన నిలవదు. సామాన్యంగా యీ రజోగుణ ప్రధానమైన చిత్తం దైత్యదానవులలో ఉంటుంది. మనలో యిల్లా ఉన్నప్పుడు దైత్యదానవ ధర్మం మనలో ఉన్నదని గ్రహించాలి.

రెండవదైన మూఢము తమోగుణప్రధానమై ఉంటుంది. తామసోద్రేకంలో చిత్తము కృత్యాకృత్యములను విమర్శించలేదు. క్రోధాధిదేవతకు సహచరిగా ఉంటుంది. ఇది ప్రధానంగా పిశాచ రాక్షసులలో నివసించుతుంది. ఇది ప్రధానంగా ఉన్నప్పుడు పిశాచ రాక్షస ప్రకృతులు మనలోకి వచ్చాయని తెలియాలి. జపయోగానికీ ప్రకృతి పనికేరాదు.

వి : అయ్యా! వీరు తామసదేవతలను ఉపాసించరా?

కృ : ప్రస్తుతము మనం భక్తియోగంలో ఉన్నాం. భగవంతుని అనుగ్రహంతో సంసారసాగరం దాటాలనే

సాధన భాగాన్నిగదా విచారించుతున్నాం? యీ భాగంలో వారు పనికిరారన్నాను.

విక్షిప్తంలో సత్వం పాలు ఎక్కువ. ఇది దుఃఖమును ఇచ్చే క్రియలకు పాల్పడదు. సుఖభోగములను కాంక్షించుతూ ఉంటుంది. ఇది ప్రధానంగా దేవతలయందుంటుంది. ఈ మూడు రకములైన చిత్తభూమికలు మన జపయోగంలో సమాధిని సాధించలేవు. ఏకాగ్ర నిరుద్ధములు రెండు సమాధికి పనికివస్తాయి. సత్వగుణప్రధానములై ఉండేవి యీ రెండే. సత్వం పెంపొందించటానికే సాధనసాదమంతాకూడా. ఈ గుణత్రయంమీాదనే సృష్టి అంతా ఆధారపడిఉంది.

వి : దేవతల మనస్సుకూడా పనికిరాదన్నమాట!

కృ : దేవతల మనస్సులో సత్వంపాలు ఎక్కువేగాని కేవలము సత్వమయంకాదు. భోగకాంక్షగల మనస్సుకు ఏకాగ్రత రాదు. పుణ్య ఫలమును భోగరూపంలో అనుభవించటానికే దేవతా శరీరములు పనికివస్తాయిగాని పుణ్యమును ఆ శరీరంతో పుట్టించుకొనుటకు పనికిరావు.

వి : చిత్తం. మనస్సు ఏకాగ్రం కావాలంటే సత్వగుణం బాగా వృద్ధికావాలన్నారు. దానికి ఆహారాన్ని మితంగా గ్రహించాలన్నారు. ఇల్లాగే ముఖ్యసూత్రాలింకేమైనా ఉన్నాయంటారా?

కృ : లేకేం? ముఖ్యంగా పరిగ్రహించవలసిన నియమం మరొకటుంది. అది మౌనం. అంటే వాగింద్రియ సంయమనం.

వి : జపం చేసేటప్పుడంటారా?

కృ : కేవలము జపం చేసేటప్పుడేకాదు. మిగిలిన సమయాల్లోకూడా ఇతర విషయములను అనగా గ్రామ్య సంభాషణలను చేయటంతో జపశక్తి నశించుతుంది. మిగిలిన సమయములలో జాపకుడు ఆ మంత్రాధిష్ఠాన దేవతకు సంబంధించిన స్తోత్రములను పఠించటం చాలా అవసరం.

వి : మరి మావంటివారికి వేరే వృత్తులుంటాయిగదా?

కృ : నేను చెప్పేది వృత్తులను వదలి కేవలం మంత్రదీక్షనే పొందమనికాదు. సామాన్య జీవితంలోకూడా నీ లౌకిక కృత్యములను నెరవేర్చుకొనగా మిగిలిన కాలంలో చేయదగిన పనినే చెప్పాను. అసలు గీతాచార్యుడు సంయమమనే యజ్ఞమును వర్ణించారు గదా?

వి : ఎక్కడంటారు?

కృ : 4 అధ్యాయం 26, 27 శ్లోకములను చూడు.

వి : చిత్తం. తమరే ఆ శ్లోకములను వివరించాలి.

కృ : "శ్రోత్రాదీనింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥
4–26

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతిజ్ఞానదీపితే॥ 27

ఈ రెండు శ్లోకములలో సంయమమనే ఒక యజ్ఞం వర్ణించబడింది. సంయమమనగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధములనే విషయములయొక్క స్వేచ్ఛను అరికట్టటం అని చెప్పానుకదా? యజ్ఞములో అగ్ని ప్రధానమైనది. ఆ అగ్నిలోచేసే హోమద్రవ్యం రెండవది. ప్రస్తుతము యీ కార్యక్రమంలో సంయమమనేదే అగ్ని. శాస్త్ర నిషిద్ధ ద్రవ్యములమీదికి, శాస్త్ర నిషిద్ధ క్రియలమీదికి త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను, జ్ఞానేంద్రియములను మనస్సును పోనివ్వకుండా ఉంచటం ఇక్కడ హోమంగా వర్ణించారు గీతాచార్యులు.

వి : శాస్త్రనిషిద్ధాహారము లేమిటంటావు ?

కృ : ఆహారం విషయంలో ముఖ్యంగా ఉల్లిపాయను నిషేధించాలి. ఇది చాలా తామసగుణజనకమైన పదార్థం. నీకు కర్మయోగంలో సాత్త్విక గుణవర్ధనములైన ఆహారములను వర్ణించి చెప్పాను. తరువాత-

ఈ జాపకునకు ప్రధానంగా కావలసింది బ్రహ్మచర్యం. జాపకుడు దీన్ని సాధించాలంటే దైవానుగ్రహంతో పాటు వీరత్వాన్నికూడా కలిగిఉండాలి. ఇతడొక ధీరుడు, వీరుడు కావాలి. ఆహారమైథునములమీదనే బంధమోక్షములు ఆధారపడిఉన్నాయి.

వి : వీరత్వం కావలసింది యుద్ధరంగంలోకదా ?

కృ : ఇదొక యుద్ధరంగమే.

వి : ఎవరితో ?

కృ : నీ శత్రువులతో.

వి : నాకు శత్రువులెవరంటారు ?

కృ : త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములనే, జ్ఞానేంద్రియములు, వాక్పాణిపాదపాయూపస్థలనే కర్మేంద్రియములు, మనస్సు, బుద్ధి, వీటిని వాడుకునే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే గుణములు. ఇవన్నికూడా భగవంతుని సమీపించటానికి వెళ్ళే సాధకునికి ఎదురై నిలిచే శత్రుసమూహం. వీటిని జయించనిదే భక్తియోగ సాధనం కుదరదు. జపసిద్ధి కలగదు.

వి : పైన వర్ణించిన వారిలో ముఖ్యమైన శత్రువు ఎవరంటారు ?

కృ : భగవానులే నిర్వచించారు. కాముడు చాలా ప్రధానమైన వాడని. విను. 3 అధ్యాయం 43 శ్లోకం.

శ్లో॥ ... ... ... ... ... ... ...
జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదం॥

కామము దురాసదమని వర్ణించారు. ఈ కామమును జయించటానికి ఎంత శక్తి కావాలో అర్జునుని సంబోధించటంలో వ్యక్తపరిచారు. హేమహాబాహో అని, నీవు చాలా

వీరుడవు కాబట్టి కామమును జయించగలవని భావం. ముందు కామాదులను జయించకుండా బాహ్యశత్రువులైన దుర్యోధనాదులను జయించలేవని నిర్ణయించారు.

వి : ముందు అంతశ్శత్రువులనే జయించాలన్నమాట !

కృ : అవును. అంతశ్శత్రువులను జయించితే బాహ్యశత్రువులనే వారే లేరు. ఈ విషయంలో నీవొక్క సంఘటనను స్మృతికి తెచ్చుకో. ఏమిటంటే హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుల సంవాదం. ప్రహ్లాదుడు హిరణ్యకశ్యపునితో అంటాడు.

ఉ॥ లోకములన్నియున్ గడియలోన జయించినవాడవు ఇంద్రియా
నీకముచిత్తమున్ గెలువనేరవు, నిన్ను నిబద్ధు జేయు నీ
భీకర శత్రులార్వుర ప్రభిన్నుల జేసిన ప్రాణికోటిలో
నీకు విరోధి లేడొకడు, నేర్పునచూడుము దానవేశ్వరా

భా॥ స్కం. 7.

వి : మన్మథుడు శ్రీమహావిష్ణువుకు పుత్రుడే కాదండి ?

కృ : అవును. అందుకే అంత శక్తి సంపన్నుడైనాడు.

వి : బ్రహ్మచర్యమును కాపాడుకోవాలంటే పాటించదగిన ప్రథమసూత్రం ఏమిటంటారు ?

కృ : స్త్రీలతోటి పొత్తు లేకపోవటం.

వి : పాపం వారేం చేస్తారండి ?

కృ : వారేమీ చెయ్యరు. మాయాదేవి తన ప్రభావము నంతా వారిలో ఉంచింది. వారి సహజ విభ్రమ విలాసములే పురుషచిత్త విభ్రమ హేతువులవుతాయి.

వి : పండితులైనవారికికూడా అంతేనంటావా?

కృ : పండితులు మోసపోవటంచేతనే స్త్రీ యంతంలోని శక్తి సంపన్నత వర్ణనీయమైంది. ఇంద్రియములు, స్త్రీ యిద్దరుకూడా ఇంద్రియ నిగ్రహంకొరకు ప్రయత్నంచేసే పండితులను, వ్రతదీక్షితులను ఇట్టే పడవేస్తాయి. అల్లా పడిపోయినవారిలో ఒక పండితుని, యిద్దరు వ్రతదీక్షితులను గురించిన కథలను చెబుతాను విను.

వి : పండితులమీదికే కత్తికట్టాడా మన్మథుడు?

కృ : విను.

జైమిని మహర్షి వ్యాసభగవానుని శిష్యుడు. ఒక సందర్భంలో వ్యాసులవారు "బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" అని పాఠం చెబుతున్నారట. అంటే ఇంద్రియ సమూహము చాలా బలవంతమైనది. విద్వాంసులనుకూడా ఆకర్షించి పడవేస్తుందని వ్యాసుని వచనం. అయితే జైమిని "విద్వాంసం నాపికర్షతి" అన్నారుట. అంటే విద్వాంసుల నేమి చెయ్యవని జైమిని అభిప్రాయం. దానికి సమాధానం జైమినికి చెప్పాలి వ్యాసులు.

ఒకరోజు సాయంకాలం జైమినిమహర్షి వారు స్నానం చేసి వస్తున్నారు. అప్పుడే ఒక స్త్రీ జైమిని ఆశ్రమంవైపుకు

వచ్చింది. ఆమెను చూచారు జైమిని. ఆమె అందచందాలు జైమినిమహర్షి వారిని ఆకర్షించినాయి. ఒక్కసారి ఓరచూపు చూచారుగాని మనస్సును మళ్ళించారు. అల్లా మనస్సుతో యుద్ధంచేశారు. అంతశ్శత్రువైన కాముడే గెలిచాడు. ఆ స్త్రీ ఆశ్రమ సమీపంలోనే చరిస్తోంది. మొత్తంపైన ఆమె ఆశ్రమానికి వచ్చింది. వెంటనే మహర్షి ఆమెను ఒకగదిలో వుంచి, తాను అగ్నిహోత్ర గృహంలోకి వెళ్ళారు. ఆమె ఆ గదిలో తలుపు గడియ వేసుకుంది. అగ్నిహోత్రములెల్లా నడిచాయో! జైమినివచ్చి, ఆమె ఉన్నగది తలుపు కొట్టారు. తలుపు తియ్యలేదా వనితామణి.

గట్టిగా తలుపు తియ్యమని ప్రార్థించారు మహర్షి. అయినా తియ్యలేదు. అప్పుడా ఋషి చూరులోంచి లోపలికి ప్రవేశించారట. ప్రవేశించి దివ్య సౌందర్యంతో వెలుగొందే ఆ కామినిని కౌగలించుకొనబోగా ఆ మాయారూపంలోవున్న వ్యాసభగవానులు సాక్షాత్కరించారు. దిగ్భ్రాంతులైనారు జైమిని. చూరులోంచి దూకటంతో చెయ్యి చీరుకుపోయిందని ఆ నెత్తురుతోనే "విద్వాంస మపికర్షతి" అన్న సూక్తిని ధృవపరచినారట.

వి : ఈ కథ ఎక్కడుందండి?

కృ : పరంపరాప్రాప్తమే.

వి : ఇద్దరు వ్రతదీక్షితు లెవరు?

కృ : విశ్వామిత్ర మహర్షి ఒకరు, విప్రనారాయణు డొకడు.

విశ్వామిత్ర మహర్షి వారు తాను బ్రహ్మర్షిని కావాలని తపస్సుకు వెళ్ళి, పుష్కరతీర్థంలో వేయి సంవత్సరముల దీక్షకు సంకల్పించేశారు. కొంతకాలం తపస్సు నడిచింది. అంతలో దేవేంద్రుడు యీయన తపస్సును భంగం చేయటానికి మేనకను పంపాడు. ఆమె తన సమాజంతో కూడా విశ్వామిత్రుని ఆశ్రమానికి వచ్చింది.

వి : సమాజమేమిటి ?

కృ : వసంతఋతువు, కోయిలలు, మన్మథుడు, వీరంతా ఒక సమాజం.

వి : చిత్తం. తరువాత ?

కృ : విశ్వామిత్రమహర్షి వారొక సందర్భంలో కన్ను తెరిచారు. అంతలో మేనక దర్శనమిచ్చింది. మెరుపుతీగ వలె మెరిసిన మేనక విశ్వామిత్రుని హృదయాన్ని ఆకర్షించింది. అంతతో వారు వ్రతభ్రష్టులై మేనక వలలో పడ్డారు. అప్పుడే పుట్టింది శకుంతల.

వి : అబ్బా ! ఎంతటి ఘట్టం ?

కృ : అబ్బా లేదు ఏమీ లేదు. భర్తృహరి ఒక చక్కని మాట అన్నాడు.

శ్లో॥ విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనాః
తేపి స్త్రీముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహం
గతాః

శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుంజంతి యే
మానవాః
తేషామింద్రియనిగ్రహోయదిభవే ద్వింధ్యః ప్లవే
త్సాగరే

అని.

విశ్వామిత్ర పరాశరాది మహర్షులు కందమూలఫలాదులతో జీవించుతూకూడా స్త్రీల ముఖమండలమును దర్శించి నంతమాత్రాననే వారి వలలోపడితే శాలిధాన్యాదులను, ఘృత మధుక్షీరాదులను భుజించేవారి సంగతి చెప్పేదేమిటని దీని తాత్పర్యం.

వి : యధార్థమండి.

కృ : వారి సూక్తులు త్రికాలసత్యములుకదా !

వి : ఇక విప్రనారాయణుని సంగతినికూడా చెప్పండి.

కృ : విప్రనారాయణుడొక గొప్ప భక్తుడు. ఇతని పేరు అసలు నారాయణుడు. ఇతడు బ్రాహ్మణుడుకనుక విప్రనారాయణుడన్నారు. అయితే నైష్ఠిక బ్రహ్మచారి. అంటే అతడు గృహస్థాశ్రమస్వీకారమును చేయదలచక బ్రహ్మచర్యదీక్షను అవలంబించిన మహానుభావుడు. అతినైష్ఠికుడు. అతడు శ్రీరంగంలో రంగనాధునికి పూలమాలలనుకట్టి సమర్పించుకుంటూ స్వామివారి సేవాకైంకర్యంలో నిమగ్నుడై ఉంటున్నాడు. ఆతడున్నది చోళరాజ్యం.

ఒకనాడు యిద్దరు వేశ్యలు చోళరాజు సభలో నాట్యమాడి యింటికిపోతున్నారు. మార్గమధ్యంలో విప్రనారాయణుని తోట వచ్చింది. ఆ తోటలో ఒక్క మల్లెంపైనా లేదు. అంతా తులసివనమే. వారిద్దరిలో ఒకామె పేరు దేవదేవి. రెండవ ఆమె దేవదేవితో విప్రనారాయణుని బ్రహ్మచర్య నిష్ఠను వర్ణించి కొనియాడింది. అంతతో దేవదేవి యితనిని ఆరుమాసములలో నాకు వశంచేసుకొని నీ వద్దకు వస్తానని ప్రతిజ్ఞ చేసింది. వారినుగురను విప్రనారాయణుడు తలెత్తియైనా చూడలేదు. వారి ప్రతిన నితడీమెరుగు ?

దేవదేవి ఒక చక్కని భక్తురాలి వేషమును ధరించింది. తులసి పూసలు, కాషాయ వస్త్రమును ధరించింది. వేణీబంధమునొక ముడివేసింది. తిరుమణి, తిరుచూర్ణమును చక్కగా దిద్ది ఒక వైష్ణవ భక్తురాలయింది. నారాయణుని ఆశ్రయమునకై వచ్చింది. ఆ భక్తురాలు తన జాతిని నిర్ణయించి ఆ వృత్తిపై తనకు కలిగిన ఏహ్యాభావమును అభివర్ణించింది. అయినా ఆ నైష్ఠిక బ్రహ్మచారి తావివ్వలేదు. అంతతో ఆమె స్వామీ ! నీ ఆశ్రయం లభించకపోతే అనశన వ్రతంతో అసువులను వీడతానని దీన భావంతో పలికింది.

నారాయణుడు దీనదయాళుడు. ఆశ్రయమును అంగీకరించి ఆమెను విడిగా ఒకచోట ఉండమన్నాడు. అలాగే ఉంటూ తోట పెంపకంలో ఆమె యీతనికి నీళ్ళను తోడి యివ్వటంలో సాయపడుతూవుండేది. అతడా నీళ్ళను అందు

కుని మొక్కులకు పోస్తూవుండేవాడు. ఇల్లా కొంతకాలం గడి చింది.

అది ఒక పరీక్షా సమయం భక్తశేఖరునకు. ఆ రోజు గాలివాన ప్రారంభమైంది. దేవదేవి తానున్న తావును వదలి చలికి వణుకుతూ నారాయణుని వీధి గుమ్మంవద్ద నుంచుంది. అంతలో పిడుగుపడి ఆ ధ్వనికి నారాయణుడు బైటికివచ్చాడు. దేవదేవిని చూచి ఆమె బాధను సహించలేక లోపలికి రాని చ్చాడు. అంతే. నారాయణుని చిత్తవృత్తి అంతా మారి పోయింది. వజ్రపంజరంలాంటి ఆతని అంతఃకరణము కరిగి పోయింది. ఎన్నో అవస్థాంతరములను చెందింది. ఈ పద్యం విను.

శా॥ ఆవిప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమైకరగి పోబోనీళ్ళకుంబల్చనై.

వి : చిత్తం పెద్ద విషయమే. కాబట్టి స్త్రీ సన్నిధానం వర్జించాలి జపయోగ సాధకుడు.

కృ : అవును. పతంజలిమహర్షి వారు యోగశాస్త్రంలో తత్వశాస్త్రమునంతా ఎనిమిది అంగముల క్రింద విభా

గంచేసి, బ్రహ్మచర్యమనేది యమమనేదానిలో ఒక భాగమని నిర్ణయించారు.

వి : ఆ ఎనిమిది అంగములు, యమములోని భాగములు ఏమిటంటారు ?

కృ : యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యానసమాధయోఽష్టావంగాని. అని సూత్రం ఇది సాధనపాదం. 29 సూత్రం.
ఈ యెనిమిదింటిలోను మొదటిది అయిన యమము నాలుగు భాగములు.
"అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః" సా. 30 సూత్రము.

వి : ఈ విషయమును గురించిన వివరణం మన గీతా శాస్త్రంలో ఎక్కడున్నదంటారు ?

కృ : గీతాశాస్త్రంలో 16 అధ్యాయంలో దైవీసంపదను వర్ణించుతూ యీ గుణములను వివరించారు.

శ్లో॥ అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునం
దయాభూతేష్వలోలు ప్త్వం మార్దవం హ్రీరచాపలం॥
ఇవి ఆత్మగుణములు. అ: 16. 2 శ్లోకం.

వి : ఒక్క చిన్నమాట. కర్మయోగంలోకూడా అహింసా సిద్ధాంతం ఉన్నదన్నారుగదా ? కర్మయోగంలో అహింసకు యీ జపయోగములోని అహింసకు తేడా ఏమైనా ఉన్నదంటారా ?

కృ : ఉన్నది. కర్మయోగములోని అహింసకొక పరిమితి ఉంది. ఇక్కడ అహింస అపరిమితమై మహావ్రతమని పేరు నొందింది. మన అభ్యాసయోగంలో హింసను సర్వథా నియమించాలి. అంటే భూతహింసకు అసలు అవకాశమేలేదు. అక్కడకు ఇక్కడకు తేడాను చెబుతాను జాగ్రత్తగా విను.

ఒక మత్స్యఘాతకుడున్నాడనుకో. అంటే బెస్తవాడన్నమాట. అతడు మత్స్యములను తప్ప వేరుజాతి జంతువులను చంపకుండావుంటే అది కర్మయోగంలో అహింసక్రిందికే వస్తుంది. అలాగే ఏకాదశి మొదలైన రోజులలో హింసను మానటమనే వ్రతంకూడా అహింసయే అవుతుంది. పుణ్యక్షేత్రములలో హింసచేయకుండా నియమించుకున్నాకూడా అహింసే అవుతుంది అక్కడ. ఇక్కడ అల్లాంటి సావకాశమే లేదు. అందుకే పతంజలి "జాతి, దేశ, కాల సమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతం" అని సూత్రీకరించారు.

వి : సత్యమంటే యదార్థ భాషణమనేనా అర్థం ?

కృ : అవును సత్యమనగా యథార్థభాషణమే. కాని ఆ యథార్థ భాషణము ఒక హింసను కల్పించకూడదు. ఎదుటి వానిని వంచించేదిగా ఉండకూడదు.

వి : సత్యములో వంచనేముంటుంది ? సత్యముకానిది అసత్యమేకదా ?

కృ : విను. సత్యమనగా తనకు తెలిసిన విషయమును ఇతరులలో ప్రవేశపెట్టటానికి పలికే పలుకన్నమాట. ఆ

పలుకు ఉన్నయధార్థమునే చెప్పినా చాలా మెలకువగా పలికి అవ్వలవానికి బోధకాకుండా ఉండే శబ్దములను ప్రయోగించటం, లేదా భ్రాంతినిగొలిపే ధ్వనిని విని పింపచేయటం లాంటివికూడా జరపవచ్చు. అట్టిమాట బాహ్యమునకు సత్యమేనన్న వాదమును నిర్ణయించినా విశుద్ధమైన సత్యభాషణం క్రిందకు రాదు.

వి : ఒక్క ఉదాహరణను చెప్పండి.

కృ : ధర్మరాజుగారు ద్రోణాచార్యులవారి విషయంలో కేవల సత్యంకాకుండాను, కేవలము అసత్యం కాకుండాను పలికారు వంచనారూపంలో.

వి : సందర్భమును కొంచెం విస్తరించండి.

కృ : ద్రోణాచార్యులవారు పాంచాలుర నందరను హతం చేస్తానని ప్రతిజ్ఞచేసి బ్రహ్మాండమైన యుద్ధమును కొనసాగించుతున్నారు. ఇరువదివేలమంది పాంచాలురను, అయిదువందలమంది మాత్స్యులను, ఆరువేల మంది సృంజయులను ఆ ప్రతినకుముందే హత మార్చారు. ఇక ధర్మరాజుకు జయం చేకూరదు. ద్రోణాచార్యులు తాను నమ్మదగిన వ్యక్తివలన అత్యంత అప్రియమైన వాక్కునువింటే అస్త్రసన్యాసం చేస్తారు అల్లా వారిచేత అస్త్రసన్యాసం చేయించటాని కని ధర్మరాజును అబద్ధం చెప్పమన్నారు శ్రీకృష్ణులు. అందుకు ధర్మరాజు సందేహించారు. అయినా ఆడక తప్పిందిగాదు. అప్పుడే ఒక అశ్వత్థామ అనే ఏనుగ

వచ్చింది. దానిని అడ్డంచేసుకుని "అశ్వత్థామ హతః కుంజరః" అన్నారు. అశ్వత్థామ హతః అన్నమాట ద్రోణునకు వినిపించేటట్లుగాను కుంజరః అనేమాట ఆయనకు వినిపించకుండాను పలికారు. అది వంచనతో కూడిన సత్యమన్నమాట. అల్లాంటిదికూడా మన భక్తియోగ సాధనలో అసత్యంక్రిందకే వస్తుంది.

వి : అంటే ధర్మరాజుగారిది అసత్యంక్రిందకు రాలేదన్న మాట.

కృ : కేవలము దానిని సత్యమని అనకూడదు. అసత్యమని అనకూడదు. ఛలము లేక వ్యాజము, మిష అనేదాని క్రిందకు వస్తుంది. స్వర్గంలో ధర్మజునకు అల్లాంటి ఫలమే కలిగింది.

వి : మన యోగసాధనలో విషయ నిగ్రహము ప్రధాన మన్నమాట.

కృ : అవును. విషయములనుండి మనస్సును ముందు నిగ్ర హించితేనే మానవుని ప్రజ్ఞ పరమార్థానికి పనికి వస్తుంది. కర్మయోగంలో కొంచెము సళ్ళించిన నియ మములన్ని అభ్యాసయోగం ప్రబలినకొలది దట్టం చెయ్యాలి. అప్పుడు ఆత్మకు బలం పెరుగుతుంది.
"ఇంద్రియాణాం హి చరతాంయన్మనోను విధీయ తే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి"

2 అ. 67 శ్లోకం.

"తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"68

స్వేచ్ఛగా చరించే ఇంద్రియములతో ఎవని మనస్సు వెళుతుందో వాని ప్రజ్ఞ నశించుతుందని చెప్పారు.

వి : అసలు విషయములు మన దగ్గరకు ఎల్లాంటి సందర్భంలో వస్తాయంటారు ?

కృ : వాటిని తలిస్తేచాలు వస్తాయి.

వి : కష్టపడక్కర్లేదన్నమాట.

కృ : వాటిపైన కోరిక పోవాలంటే విశ్వామిత్ర వశిష్ఠులు కావాలిగాని వాటిని ఆహ్వానించాలంటే పెద్ద ప్రయత్నం అక్కర్లేదు.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూప
జాయతే॥
2. అ. 62 శ్లో.

అన్నారు కృష్ణులు. విషయ సౌందర్యము స్మృతికిరాగానే వాటిపైన సంగం కలుగుతుంది. ఓహో! హో! ఏమి అందంగా ఉంది ? అని మాంసపిండంపైన సౌందర్యగరిమను ఆరోపించుకుని ఉపాసించటం ప్రారంభంకాగానే దానివెంటనే సాక్షాత్కరించుతాడు మన్మథుడు. ఆయన వెంటనంటే ఉంటారు క్రోధాది సమూహమంతా. వారందరు మనయింటిని ముట్టడించుతారు. అంతతో వారి సమూహం మనదే అయి మిత్ర రూపంతో శత్రుత్వాన్ని సాధించుతూ ఉంటుంది. ఆత్మ

రాజ్యం వారి స్వాధీనంకాగా మన బ్రతుకంతా వారిచేతిలోకి వెళ్ళి, శాంతి అనే ప్రియను కోల్పోతాం. భక్తియనే తల్లికి దూరమౌతాం. అందుకని గీతాచార్యులు ముందు వాటిని తలచకు వీరుడా ! అని చెప్పారు.

వి : "ఓం శాంతి శ్శాంతిః" ఆ తలపులు వచ్చినప్పుడేం చెయ్యాలంటారు ?

కృ : మన అంతఃకరణ తలుపులు వెయ్యాలి. అంటే విషయములలో ఉండే దోషములను పరిశీలించి ఆలోచించాలి. స్త్రీ వ్యామోహం కలిగినప్పుడు ఆ స్త్రీ యొక్క సౌందర్యములోని యథార్థమును విచారించి తన ఆరోపణను తొలగించుకోవాలి. అంటే ప్రతిపక్షమును భావించాలి. అల్లాగే హింసాది విషయములు కూడా.

వి : ఉదాహరణ చెప్పాలి.

కృ : అలాగే చెబుతాను. ఏకాగ్రంగా విను.

వి : చిత్తం !

కృ : ముందు హింసనే తీసుకో. మనం ఎవరినైనా చంపుదామన్న ఊహ మనకు జనించగానే యిల్లా ఊహించు. మనము ఒకరిని చంపుతాం. ఆ నేరం బయటకు రాకుండా ఉండటానికి అబద్ధమును ఆడతాం. ఆ చంపబడ్డవాని ధనమును అపహరించుతాం. వాని స్త్రీలను చెరుస్తాం. ఇల్లా వెళ్ళివెళ్ళి నరకహేతువులు యెన్ని

ఉన్నాయో అన్నింటిని సంపాదిస్తాం." అని దాని దోషాలను భావించాలి. అల్లాగే కామంకూడా ఉద్రేకించుతుందనుకో. అప్పుడు పరభార్యలకోసరం ప్రయత్నించుతాం. రావణ కీచకులులాగా నాశనమౌతాం. లేక తాత్కాలికంగా వ్యాధి సంక్రమణం కావచ్చు. ఆ స్త్రీ మనను పశువుగా వాడుకోవచ్చు. తరువాత ఛీ పొమ్మనవచ్చు ! ఇదంతా మాంసపిండమే కదా ! చర్మం లేకపోతే ఆ అస్థిపంజరంలో సొగసెక్కడిది ? అని భావించాలి. అల్లాంటి భావనలకు అనుభవజ్ఞులైన మహాకవుల వైరాగ్యబోధక వర్ణనలను చదవాలి.

వి : ఊహించాలి. నిజంచెప్పాలంటే హింససంగతి అల్లా ఉంచండి. కామం విషయంలో చర్మపినద్ధమైన మాంసపిండమే అయినా నిగనిగ కనబడుతుందిగాని అసహ్యం కనబడదెందుకంటారు ?

కృ : పూర్వసంస్కారం నశించక.

వి : ఎప్పుడు నశిస్తుంది ?

కృ : భావించగా భావించగా పూర్వసంస్కారం నశించి నూతన భావనాసంస్కారం దృఢమౌతుంది. అందుకే శంకరులు నీ కన్ను బాహ్యసౌందర్యంచూచి మురుస్తూ ఉంటుందనుకో. నీమనస్సును, కప్పివున్న చర్మంలోనికి చొప్పించు. అక్కడ రక్తమాంసములు, వస మొదలైనవాటిని చూస్తావన్నారు.

"ఏతన్మాంసవసాదివికారం మనసివిచింతయ వారం వారం." భజగోవింద శ్లోకం.

ఇల్లాగే ఒక మహాకవి ఒక తమాషాను చెప్పాడు.

ఒక సస్యశ్యామలమైన చేనుకు దృష్టిదోషం తగలకుండా ఆ రైతు ఒక పుర్రెను కర్రకు తగిలించి ఆ కర్రను అక్కడ పాతాడు. ఆ పుర్రె గాలికి కదులుతోంది. ఆ కదలటంలో తల క్రిందికి పైకి ఊగుతోంది. దానిని ఇల్లా ఊహించుతున్నాడు కవి.

ఆ తల పుర్రెకు పండ్లు వెలుపలకు వచ్చిఉండగా ఆ పుర్రె కామాంధులగువారిని చూచి కొన్ని ప్రశ్నలువేస్తూ వారిని పరిహసించుతున్నదట.

శ్లో॥ క్వైతద్వక్త్రారవిందం ? = కామాంధుడా స్త్రీల ముఖమండలమును పద్మమని వర్ణించుతారుగదా ! ఏది ? పద్మము ?

క్వ తదధరమధు ? = స్త్రీల అధరోష్ఠమునందు మధువున్నదా ? చూడు.

క్వాయతా స్తేకటాక్షాః ? = తన లొట్టపోయిన కన్నులనుచూపి క్రీగంటి ప్రసారములేవి ? అంటోంది.

క్వాలాపాః కోమలా స్తే ? = స్త్రీల కోమల వాక్కులెక్కడ ?

క్వచ మదనధనుర్భంగురో భ్రూవిలాసః ? = స్త్రీల కనుబొమలను మన్మథబాణములంటారు అవి ఏవి ? నా కనుబొమలను చూడు. అని నవ్వుతున్నదట.

ఇంత్థ ఖట్వాంగకోటి ప్రకటితదశనం మంజగుంజత్స
మీరం రాగాంధానా మి
వోచ్చైరుపహసతి మహా మోహాజాలం కపాలం॥

ఈ విధంగా విషయములు తలపుకు వచ్చినప్పుడు విప రీత భావనను చేస్తే అవి అంతరించుతాయి.

వి : ఒక్కమాట.

కృ : ఎన్నిమాటలైనా అడుగు.

వి : మీ అనుగ్రహం అక్కడే. తమరు విషయములు మన నమునకు రాగా వాటిని ఎదుర్కొనుటకు వాటి దోష ములను భావించమన్నారుగదా ! అది మీ అనుభవ విశేషమా ? శాస్త్రంలో సంగతేనా ?

కృ : ఒకవేళ ఎవరైనా మా అనుభవ విశేషాలని చెప్పినా నమ్మరు. అయితే పెద్దలు కొందరు మా అనుభవము అంటారు. దాని కర్థమేమంటే ? శాస్త్రబోధను మేము ఆచరణలో పెట్టగా అది మా అనుభవమునకుకూడా వచ్చిందని అర్థంగాని శాస్త్రం చెప్పని వాటిని యీ చెప్పేవాడు కనుక్కున్నాడని అర్థంకాదు. ప్రతిపక్ష భావన చెయ్యాలని శాస్త్రకారులే చెప్పారు. పతంజలి సూత్రం.

"వితర్కబాధనే ప్రతిపక్షభావనం" సా. పా. 33 సూ.

వితర్కములను బాధించుటకు ప్రతిపక్షమును భావించ మని సూత్రార్థం. వితర్కములనగా-

వితర్కా హింసాదయః కృతకారితానుమోదితా
లోభక్రోధమోహపూర్వకా మృదుమధ్యాదిమాత్రా

దుఃఖాజ్ఞానానంతఫలాఇతి ప్రతిపక్షభావనం॥

సా. పా. 34 సూత్రం.

వి : మొత్తానికీ విషయనిగ్రహం పెద్ద యుద్ధమే.

కృ : యుద్ధమా ! యుద్ధమా ! అయితే ఒక్క రహస్య ముందీ యుద్ధంలో. ప్రధానుడుగా ఉండే ప్రతిపక్ష వీరుని ఒక్కనిని జయించితే వానికి సంబంధించిన భట సమూహమంతా మనచేతి క్రిందకివస్తుంది. అందువల్ల పెద్దభయంఅక్కర్లేదు. ఈజపయోగాభ్యాసానికిఆహార నియమమును బ్రహ్మచర్యమును పాటించి జపయజ్ఞ మును నెరవేరిస్తే జపాధిష్ఠానమూర్తి నీ మనస్సున కొక నిర్మలతను కల్పించి ధ్యానసిద్ధిని పొందటానికై వెళ్ళే నీ ముందు నడుస్తాడు. మూర్తి సాక్షాత్కారం కావాలంటే జపయోగంతో కలుగుతుంది. ఆ మూర్తి లోనిమాధుర్యాన్ని అనుభవించాలంటే ధ్యానయోగా భ్యాసమును చెయ్యాలి.

వి : పర్యవసానం మానసిక జపంతో హఠయోగ మక్కర లేకుండానే మనస్సుకు ఏకాగ్రత వస్తుందంటారు. అంతేనా ?

కృ : అవును.

ముందు శుచిర్భూతమైన ఒక గదిని నిర్ణయించుకో, దానిని గోమయంతో శుద్ధిచెయ్యి. ఆ గదిలో ఒక పీట వేసుకో. అది మరీ ఎత్తుగా లేకుండా మరీ లోతుగాలేకుండా ఉండాలి. దానిపైన దర్భాసనం,దానిపైన వస్త్రాసనంవెయ్యి. దానిమీద కూర్చో. మనస్సులో ఉండే విషయాది వాసనల

నన్నిటిని బయటకు వెళ్ళమని చెప్పు.వాటినిబయటకుపంపమని నీ యిష్టదైవమును అనగా నీవుచేసే మంత్రాధిష్ఠానదైవమును ప్రార్థించు. మనస్సును ఏకాగ్రంగా ఉంచు. వెన్నును వంచకు. శిరస్సు, మెడ, శరీరమధ్యభాగము సమానముగా ఉండునట్లుగా కూర్చో. దిక్కులను చూడకు. నీ దృష్టిని ముక్కుకొనపైన ఉంచితే ఎల్లా ఉంటుందో అల్లా ఉంచు. పెదవులు కదలకుండా నాలుకకు చలనంలేకుండా మనస్సుతోనే మంత్రాక్షరములను, ఆ మంత్రార్థభావనను చేస్తూ జపించు. ఇది జాపకుని అభ్యాస యోగం. ఇది భక్తిరస ప్రాదుర్భావమునకు ఒక భూమిక. రెండవది ధ్యానయోగ సాధన. నేను చెప్పిన ఉనికినే గీత 6 అధ్యాయం. 11. 12. 13 శ్లోకములలో చెప్పింది.

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజిన కుశోత్తరం" అ. 6 శ్లోకం.

"తత్రైకాగ్ర్యం మనఃకృత్వా యతచిత్తేంద్రియ క్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే" 12
"సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్ 13

వి : చిత్తం. నాకీనాటికి జపయోగమనే విషయం తెలిసింది. చిత్తనిరోధక సాధనను అభ్యాసం చేస్తాను. ధ్యానయోగ మును గురించికూడా యీ నాడే చెబుతారా?

కృ : కాదు. చెప్పిన దానిని మననం చెయ్యి రేపు చెబుతాను. ఇంతవరకు మంత్రానుష్ఠాన సాధనను చెప్పాను. ధ్యానసాధనను రేపు చెబుతాను.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః

ఓమ్

3వ రోజు గోష్ఠి

# ధ్యాన సాధన

కృష్ణానంద విజయులిద్దరు విచ్చేశారు గోష్ఠికి. విజయుడు వందన సమర్పణతో గురువర్యులను ప్రశ్నించుచున్నాడు.

వి : స్వామీ ! నిన్న ధ్యానయోగమును గురించి రేపు చెబుతానన్నారుగదా ?

కృ : అవును.

వి : మరి శెలవివ్వండి.

కృ : ప్రశ్నించు.

వి : నా ప్రశ్నతోనే ప్రారంభమంటారా ?

కృ : ప్రశ్న లేకపోతే సమాధాన మెక్కడిది ?

వి : తమ మార్గమే అది.

కృ : నా మార్గంకాదు శాస్త్రముయొక్క మార్గం.

వి : అలాగే. ధ్యానమనే మాటకు అసలు నిర్వచన మేమిటంటారు ?

కృ : మనస్సు యే యితర విషయములను తలచకుండా ఒకే ఒకచోట ఒక గిన్నెలో నూనెపోసి వంచితే ఆ నూనె ఎల్లా ఏకధారగా పడుతుందో అల్లా మన మనస్సు ఏకంగా నిలబడి ఉండటానికి ధ్యానమని పేరు.

తైలధారావత్సంతతః అవిచ్ఛిన్నప్రత్యయో ధ్యానం.
శం. భా.

వి : నిత్యజీవితంలో యీ ధ్యానయోగాభ్యాసాన్ని ఎల్లా సాధించాలో గీతాశాస్త్రం అందించిన సులభ సందేశములను సమన్వయించి చెప్పాలి తాము.

కృ : అలాగే.

"బ్రూయుః స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత" ప్రేమాస్పదుడైన శిష్యునకు చెప్పని రహస్యములేముంటాయి?

జపయోగంలో కొన్ని నియమములను చెప్పాను. అవియే ఇందులో పెంపొందాలి. ప్రధానంగా యిందులో ఏకాంతసేవనం అవసరం. బాహ్య ప్రకృతిలోని ప్రశాంతి ఆంతర ప్రకృతికికూడా రమణీయతను కల్పించుతుంది.

వి : జపయోగానికైనా యిది అవసరమేకదా ?

కృ : అవసరమే అయినా దీనికి ఎక్కువపాలు కావాలి. ఆహారాది నియమములు పైనచెప్పినట్లే. కూర్చునే పద్ధతిని నిన్న చెప్పానుగదా ? అల్లాగే ధ్యానమునకు కూడా కూర్చోవాలి.

వి : చిత్తం, తరువాత ?

కృ : జపయోగంలో నీవు అనుష్ఠించిన మంత్రమునకొక మూర్తి, ధ్యాన శ్లోకమున వర్ణించబడి ఉన్నదిగదా ? ఆ మూర్తియొక్క స్వరూపమునంతా పాదాది శిరః పర్యంతము అనగాహానచేసుకుని అనగా ఆ మూర్తి

యొక్క అవయవములనన్నిటిని బాగుగా గుర్తుపట్టి, తరువాత ఆ మూర్తిని ధారణచెయ్యాలి.

వి : ఒక్క మనవి.

కృ : అడుగు.

వి : భగవద్గీతలో ప్రణవధ్యానముచే ప్రధానంగా చెప్పారు గదా ? తమరు మూర్తిధారణమంటారేమిటి ?

కృ : నేను చెప్పేది, గీతలో చెప్పినది ఒక్కటే. ధ్యాత (అనగా ధ్యానముచేయువాడు) అనుభవింపవలసినది ఆనందము. ఆఆనందము ప్రాకృతమని, అప్రాకృతమని రెండు విధములు. బాహ్యవిషయ ధ్యానమువలన బాహ్యేంద్రియములతో స్థూల శరీరభానముకలిగి, స్థూలశరీర సహాయమున అనుభవించునది ప్రాకృతానందము. దీనినే విషయానందమని ప్రాపంచికానందమనికూడా అంటారు. రెండవది అప్రాకృతానందము. లోగడ ప్రాకృతానందమును ప్రధానంగా చేసుకుని బాహ్యవృత్తులతో ఏకీభవించిన యీ ధ్యాత లేక యీ ముముక్షువు, కాక యీ భక్తుడు నేడు అనుభవించదలచినది అప్రాకృతానందము, అవిచ్ఛిన్న సుఖమూను. అట్టి ఆనందానుభవమునకే సమాధి అని పేరు. ధ్యాత తాను చేయు ధ్యానాభ్యాసముచే ఆ అప్రాకృతానందమున లీనమై తన భావనా స్వరూపమునే కోల్పోయినప్పుడది అసంప్రజ్ఞాత సమాధి అని పిలువబడుతుంది. అంటే బాహ్యప్రపంచ వృత్తులనేకాకుండా

సంస్కారరూపంలో ఉండే వృత్తులనుకూడా మరచి ఉండటమన్నమాట.

బాహ్యావృత్తులను మరచి నిస్సంశయమైన ఒక భావ విశేషంలో ఆనందాన్ని అనుభవించుతుంటే దానికి సంప్రజ్ఞాత సమాధి అని పేరు. అల్లా ఆనందస్వరూపమైన పరమాత్మను పొందటానికే రెండువిధములైన ప్రతీకలను వర్ణించినాయి శ్రుతిస్మృతీతిహాసపురాణములు. ఆ ప్రతీకలలో మొదటిది నాదమూర్తి, రెండవది అవయవమూర్తి. ఎప్పుడైనా ధ్యానయోగంలో కలిగే సాక్షాత్కారము సూక్ష్మేంద్రియములకు కలుగుతుంది. నాదమూర్తిని ధ్వనిరూపంలో సూక్ష్మ శ్రోత్రేంద్రియంతో సాక్షాత్కరింప జేసుకుని ఆనందించుతూ ఆ ఆనందంలో లీనమాతుంది మనస్సు. దీనికి నాదబ్రహ్మోపాసన అంటారు. సూక్ష్మాతిసూక్ష్మమైన ఆ నాదబ్రహ్మలో చిత్తము లీనంకావటమే ఆ ఉపాసనలో సమాధి. త్యాగయ్యగారు స్వరతాళ లయగతులతోటి ముక్తి అన్నది దీనినే.

రెండవది అవయవమూర్తి. ఇవి చాలా ఉన్నాయి. దేవకార్యార్థమై లేక సాధుపరిత్రాణమునకై అప్పుడప్పుడుగా అవతరించిన మంగళ మూర్తులన్నమాట. ఈ మూర్తులను ధ్యానమున సూక్ష్మచక్షువుతో దర్శించి, ఆ ధ్యేయమూర్తిలోని రూపమాధుర్యమును అనుగ్రహ రూపకటాక్ష వీక్షణాదులను భావించుతూ ఆనందించి ఆనందించి మనస్సు విలీనంకాగా మూర్తిధ్యానమున సమాధి. ఇదే సగుణధ్యానసిద్ధి.

ప్రణవధ్యానమునకు లక్ష్యమైనదే మూర్తిధ్యానము యొక్క లక్ష్యముకూడా.

వి : క్షమించాలి. ఒక్కమాట. మరి రెంటికి లక్ష్యం ఒక్కటే అయినప్పుడు ప్రవణమునకు ఎక్కువ ప్రాధాన్యత ఎల్లా వచ్చిందంటారు ?

కృ : అల్లా అడుగు. అసలు ప్రతీకమనగా ఒక ఆలంబనమన్నమాట. ఒక విగ్రహంపైన శ్రీమహావిష్ణువును భావించటంలాంటిది. అల్లాంటి ఆలంబనలలో ఓంకారము ప్రధానమై ఉండటంతో అంటే పరబ్రహ్మను అందించటానికి చాలా దగ్గర కావటంచేత ప్రణవమునకు ప్రత్యేక స్థానం వచ్చింది. మట్టితో చేసిన విగ్రహంపైన విష్ణుభావనను చేయుటకంటే సాలగ్రామ శిలయందు చేయటం చాలా ప్రశస్తంకదా ? అల్లాగే ప్రణవమును పరమాత్మగా భావించి, నాదానుసంధానం చేయుటం ప్రశస్తమని గీత చెప్పింది. అధికారి భేదము ననుసరించి ఆలంబనలను వర్ణించింది తత్వశాస్త్రం. స్థూలరూపంలో బాహ్యంగా ప్రణవమునకు ఒకఆకారంవుంది. అది మనం వ్రాసుకునే వర్ణమే. దానిని విభాగంచేస్తే, అకార, ఉకార, మకారములు, బిందువు కనబడతాయి సూక్ష్మదృష్టి కలవానికి. అల్లాగే బాహ్యపూజలో దేవమందిరం ఉంటే మన ధ్యానయోగంలో శరీర అంతరభాగంలో మూలా

ధారాది చక్రములు వర్ణించబడ్డాయి. ఇప్పుడు మన అభ్యాసం అక్కడ చెయ్యాలి.

వి : పైన తమరు ధ్యానయోగంలోని ఆనందానుభవములను వర్ణించారుగదా? ఎవరి అనుభవములైనా వాటికి ఉదాహరణలుగా దొరుకుతాయంటారా ?

కృ : ఉదాహరణలకేం ? ఇద్దరు సాధకుల అనుభవాలను చెబుతాను. ఒకరు నారదులు. రెండవవాడు ధ్రువుడు.

భాగవతంలో నారదుని పూర్వజన్మ చరిత్ర వర్ణించబడింది. అతడు ఒక దాసీపుత్రుడు. ఒకప్పుడాతని పూర్వపుణ్య విశేషంవల్ల కొంతమంది మహాపురుషుల సంసర్గం కలిగింది బాల్యంలోనే. అప్పుడాతడు వారి శుశ్రూషచేయగా వారా బాలునకొక మంత్రరాజము నందించి వెళ్ళారు. తరువాత ఆ బాలుని తల్లి మరణించటం నారదులు ఒకచోట కూర్చుని ఆ మంత్రమూర్తిని ఆరాధించటం జరిగింది. ఆ సందర్భంలో నారదునకు కలిగిన భగవత్సాక్షాత్కారమును గురించి నారదమునీంద్రులే వ్యాసభగవానునకు తన పూర్వజన్మ చరిత్రను చెబుతూ వర్ణించుతారు. ఈ వర్ణనలో ధ్యాత తన స్వరూపమును మరచి, సాక్షాత్కరించిన భగవద్రూపమునుకూడా చూడజాలక ఆనందానుసంధానంలో ఉండటం ద్యోతకమౌతుంది. నారదులు ఇల్లా చెబుతున్నారు.

వ. దుస్తరంబులైననవవేణు కీచకగుల్మలతాగహ్వరంబుల పొంత నొక్క రావిమ్రానిదగ్గర కూర్చుండి యే

విన్నచందంబున నాహృదయగతుం బరమాత్మ స్వరూపు హరిం జింతించితి.

శా. ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతోఁ దత్పద

ధ్యానారూఢుడ నైన నాతలపులో నద్దేవుడుం దోచె నే నానందాబ్ధిగతుండ నై యెరుగ లేనైతిన్ ననున్నీశ్వరున్ నానాశోకహమైనయ త్తనువుగానన్ లేనియట్లంతటన్.

వి : అర్థమైంది. ధ్రువచరిత్రనుకూడా ఒక్కమారు శెల విమ్వండి.

కృ : ధ్రువచరిత్ర భాగవత చతుర్థ స్కంధంలో వర్ణించ బడింది. ఇతడు ఉత్తానపాదుని పుత్రుడు. ఈ భక్త శేఖరుని తల్లి పేరు సునీతి. సవతి తల్లి చేసిన యవమా నమును భరించలేక మాతృమూర్తి ఉపదేశంతో శ్రీహరినిగూర్చి తపస్సు చేయటానికై అడవికిపోతూ ఉంటే మధ్యేమార్గంలో నారదమునీంద్రు లాతనికి భగవద్ధ్యాన మార్గము నుపదేశించి పంపారు.

అతడు మధువనంలో ప్రవేశించి యమునానది ఒడ్డున ఆరుమాసములు ధ్యాననిష్ఠను ఆచరించాడు. ప్రథమంగా బాహ్యార్చననుచేసి, అంతరంలోకి వెళ్ళాడు. యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణలను సాధించాడు. అంతతో మనోమలమంతా క్షాళనం చేయబడింది. మూడేసి రాత్రుల కొక్కమారు ఫలభక్షణంచేస్తూ మాసంరోజులు, ఆరేసిరోజుల కొక్కమారు ఎండుటాకులను భక్షించుచు

రెండవమాసమును గడిపి తొమ్మిదిరోజుల కొక్కమాటు ఉదకభక్షణంతో మూడవమాసమును గడిపాడు. నాల్గవ మాసంలో వాయుభక్షణమే జరిగింది. అయిదవమాసంలో అతడొక రాయిలా అయిపోయినాడు. ఆ ధ్యాననిష్ఠుని హృదయంలోకి విషయములేవీ ప్రవేశించలేకపోయినాయి. సర్వేశ్వరున కొక్కనికే అతని హృదయము స్థానమైంది. ఆరవ మాసంలో దేవతల కాశ్చర్య భయభ్రాంతులు కలిగే ధ్యాన స్థితి కలిగింది. ఆ స్థితిలో భగవత్సాక్షాత్కారం కలిగింది. దేవతలు వెళ్ళి శ్రీమన్నారాయణునకు విన్నవించారు ధ్రువునికి సాక్షాత్కరించి తపమును విరమింప చెయ్యమని.

వి : ఒక్క సందేహం. ఇందులో దేవతల కేమిబాధ?

కృ : మంచిప్రశ్నవే వేశావు. శుకులు పరీక్షిత్తుకు చెప్పిన పద్యం విను.

చ. అతడు ననన్యదృష్టినిజరాచరదేహశరీరధారణా
స్థితిగల యీశునందు చనజీవితమున్ ఘటియింప జేసి యే
శత గన దన్నిరోధమునగైకొని కంపము నొందె నీశ్వరుం
డతడు చలింప నిజ్జగములన్నియు జంచల మయ్యె భూవరా॥

నీ ప్రశ్నకు సమాధానం వచ్చిందా?

వి : చిత్తం వచ్చింది. చరాచర ప్రపంచమే శరీరముగాగల ఈశ్వరుని తన చిత్తంతో నిరోధించటంతో అతడు

చలించగానే భూతములన్నీ చలించి దేవతలు భయ పడ్డారు. అంతేగదా !

కృ : అంతే.

వి : తరువాత చెప్పండి.

కృ : ధ్రువుని హృదయ పుండరీకంలో మెరుపుతీగవలె మెరిసి పోయ్యే ధ్యేయమూర్తి అంతలో అంతర్ధానమై అతని ముందట నిలిచాడు. అతడెవరు ? ఇంతకు పూర్వంలో జ్ఞాన నేత్రమునకు గోచరమైనవాడే. అంటే ధ్రువుడు ధ్యానంలో వర్ణించుకుంటున్న మూర్తేనన్నమాట, ఆ మంగళ విగ్రహమును దర్శించగానే ధ్రువుడిల్లా ఉన్నాడట.

తే. ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
మూర్తిగనుగొని సంభ్రమమును సమ్మో
దాశ్రువులు రాలబులకీకృతాంగుడగుచు.

తే. నయనముల విభుమూర్తి పానంబు సేయు
పగిదిదన ముఖముననుజుంబనముసేయు
లీలదగిలి భుజముల నాలింగనంబు
సేయుగతి దండవన్నమస్కృతులొనర్చె.

ధ్రువుని శరీరం పులకరించింది. ఆనందాశ్రువులు జల జల రాలినాయి. నేత్రములు ఆమూర్తియొక్క రూపరసమును త్రాగచూస్తున్నాయి. మూర్తియొక్క ముఖమండలమును

ముద్దుగొనబోతోంది ధ్రువుని ముఖం. ధ్రువుని బాహువులు ఆ మంగళమూర్తిని ఆలింగనం చేయబోతున్నాయి. వాక్కు స్తుతించవలెనని ఉవ్విళ్లూరుతోంది. కాని ఆ ఇంద్రియములతో ప్రత్యేక క్రియలను చేయలేక సాష్టాంగపడ్డాడు ధ్రువుడు. తాను వచ్చినపనినికూడా మరచిపోయినాడు. శ్రీమన్నారాయణుని చరణకమలములే ఆశ్రయములైనాయి. అంతలో ధ్యేయమూర్తి కరకమలంలో ఉన్న శంఖంతో ఉదకమును చల్లాడు ధ్రువుని శిరస్సుపైన. ఆ ఉదకధారలే ధ్రువునికి బాహ్యస్మృతిని ఆంతరస్మృతిని ఇచ్చినాయి. అంతతో స్తుతించాడు ధ్రువుడు. ఇవి ధ్యానంలో భగవత్సాక్షాత్కారమున కుదాహరణలు—

వి : మహాభాగ్యం. అయితే యీ భాగ్యమును సాధించటానికి హృదయకమలం ప్రధానమన్నమాట.

కృ : అవును.

వి : మన అంతశ్శరీరంలో ఆ హృదయకమలమునకు స్థానమెక్కడంటారు ?

కృ : చెబుతాను. జాగ్రత్తగా విను. హృదయకమలము ఒక్కటేకాదు. షట్కమలములున్నాయి. మనకు ఆంతర ధ్యానం చెయ్యటానికి మన శరీరాంతర్భాంలో ఆరు పీఠాలున్నాయి. వాటినే షట్చక్రములంటారు, లేక ఆరు కమలములంటారు. 1. మూలాధారం. 2. స్వాధిష్ఠానం. 3. మణిపూరకం. 4. అనాహతం. 5. విశుద్ధం. 6. ఆజ్ఞాచక్రం. 7. సహస్రారం.

మొదటిదైన మూలాధారం నాలుగు దళములుగలిగి ఉంటుంది. దీని వర్ణము పుటంబెట్టిన బంగారంలాగా మెరుస్తూ ఉంటుంది. పంచభూతములలో మొదటిదైన పృధివీభూతమునకీ కమలమే ఆధారం. ఘ్రాణేంద్రియ మునకు కారణమై ఉండేదికూడా ఇదే. ఈ కమలము యొక్క నాలుగు దళములమీద వ, శ,ష, స, అనే నాలుగు వర్ణములు ఉంటాయి. ఇది మన లింగస్థానము నకు క్రింద భాగంలో గుదస్థానమందుంటుంది. పైన వర్ణించిన ఏడు చక్రములకు అధిష్ఠాన దేవతలుంటారు. ఆ దేవతలలో యీ మూలాధారమునకు విఘ్నేశ్వరు డధిష్ఠాన దేవతగా ఉంటాడు. పుష్టి శక్తి సమేతుడై కుంకుమవర్ణంతో వెలుగొందుతూ ఉంటాడు.

రెండవది స్వాధిష్ఠానం. ఇది ఆరు దళములు కలిగి ఉంటుంది. దీని ఛాయ ఎరుపు. జలభూతమున కాధారం యీ చక్రమే. ఇది జిహ్వేంద్రియమునకు కారణం (నాలుక) ఈ కమలమునకున్న ఆరు దళములపైనా బ, భ, మ, య, ర, ల, అనే ఆరు వర్ణములుంటాయి. ఈ చక్రం లింగస్థానమందే ఉంటుంది. దీని కధిష్ఠాన దేవత చతుర్ముఖబ్రహ్మ. ఇతడు శుద్ధ శ్వేతవర్ణంతో ఉండే సరస్వతితో కూడా రక్తవర్ణం కలిగి దీనిలో వెలుగొందుతూ ఉంటాడు.

మూడవది మణిపూరక చక్రం. దీనికి దళములు పది ఉంటాయి. దీనిరంగు పచ్చగా ఉంటుంది. అగ్నిభూతమునకిది నివాసస్థానము. నేత్రేంద్రియ కారణమూను. ఈ చక్రమునకున్న

పది రేకులమీద డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అనే పది బీజాక్షరములూ ఉంటాయి. ఈ చక్రం నాభి స్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదైవము లక్ష్మీసమేతుడైన శ్రీమహా విష్ణువు.

నాల్గవది అనాహతచక్రం. దీనికి దళములు పండ్రెండు. దీని వర్ణము తెలుపు. వాయుభూతమునకిది నివాసస్థానమై, త్వగింద్రియమునకు (చర్మము) కారణమై ఉంటుంది. దీని పండ్రెండు దళములపైనా పండ్రెండు బీజాక్షరములు ఉంటాయి. అవి క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట ఠ, అనే వర్ణములు. దీనికి రుద్రు డధిష్ఠానదేవత. ఇతడు పసిడి చాయతో వెలుగుతూ పార్వతీసమేతుడై ధ్యాతసమర్పించే పూజలనందుకుంటూ ఉంటాడు. ఈ చక్రము హృదయ స్థానంలో ఉంటుంది.

అయిదవది విశుద్ధ చక్రం. ఇది పదహారు దళములు కలిగి, నీలవర్ణంతో విరాజిల్లుతూ ఉంటుంది. ఆకాశభూతము దీనినే నివాసస్థానంగా గ్రహించింది. ఇది శ్రోత్రేంద్రియమునకు కారణం. (చెవి) ఈ చక్రమునకున్న పదహారుదళములపైనా పదహారు అచ్చులు అంటే అ మొదలు అః వరకు ఉంటాయి. ఈ చక్రం కంఠ స్థానమందుంటుంది. దీనికి అధిష్ఠానదేవత జీవుడు. ఇతడు శుద్ధ స్ఫటికవర్ణం కలిగి ప్రాణశక్తితో కూడా ఇక్కడ ఉంటాడు.

ఆరవది ఆజ్ఞా చక్రం. దీనికి దళములు రెండే. ఇది మాణిక్యమనే మణివర్ణం కలిగి ప్రకాశించుచూ ఉంటుంది. మన

మనస్సు దీనియందే నివసించిఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత పరబ్రహ్మ. దీని రెండు దళములమీద హం, క్షం, అనే వర్ణములు రెండూ ఉంటాయి. ఇది మన కనుబొమల మధ్య ఉంటుంది.

ఏడవది సహస్రారచక్రం. దీనికి వేయి దళములుంటాయి. దీని రంగును వర్ణించటానికి ఉపమానంలేదు. కోటి సూర్యుల వెలుగుకలిగి ఉంటుంది. గురువే దీనికి అధిదేవత. దీనినే బ్రహ్మరంధ్రమంటారు. పరబ్రహ్మ అన్నా గురువు అన్నా ఒక్కటే అన్న భావంలోనే దీనికి అధిష్ఠానదైవంగా గురువు వర్ణించబడ్డాడు. ఈ విధంగా వర్ణించబడ్డ కమలములలో ఎచ్చోటనైనా ధ్యేయమూర్తిని ధ్యానం చేయవచ్చు.

వి : ఈ చక్రములు మన శరీరాంతర్భాగంలో దేనిని ఆధారంగా చేసుకుని ఉంటాయంటారు ?

కృ : మన గుదస్థానంలో ప్రారంభమై శిరస్సుదాకా ఒకే స్వరూపంలోఉన్న వెన్నెముకను వీణాదండమని, బ్రహ్మదండి అని అంటారు. ఆ ఎముకలో కొంత ఖాళీ ప్రదేశం ఉంటుంది. ఆ ప్రదేశంలో తామరతూడులోని దారంవలె ఒక తంతువుంటుంది. ఆ తంతువును ఆశ్రయించి యీ చక్రములున్నట్లు యోగశాస్త్రం చెబుతుంది.

వి : అయితే ఆపరేషన్ చేసే శస్త్రవైద్యులకి చక్రములు దృగ్గోచరమౌతాయంటారా ?

కృ : ఆవు పొదుగులో ఉన్న పాలను ఆపరేషన్ చేసి చూడ గలవా ? కట్టెలో ఉన్న నిప్పును గొడ్డలితో నరికిగాని, రంపంతో కోసిగాని చూడగలవా ? పాలను పితుకవల సిందే. అగ్నికొరకు మథించవలసిందే. అల్లాగే ఇక్కడ కూడా యోగశాస్త్రం చెప్పినట్లు ఆ చక్రములా వీణా దండము నాశ్రయించి పైన ఉన్న వర్ణన ప్రకారంగా భావించితే కనపడాలిగాని ఆపరేషన్ తో కనపడవు. ఆ తంతువును ఆశ్రయించి యీ చక్రములున్నట్లు భావించుతూ ఆ భావనను దృఢంచేసుకోవటమే ఆ చక్రములు మనకు గోచరం కావటం. ఇక్కడ మనం ప్రధానంగా ఆ హఠయోగానికి వెళ్ళకుండా ఆ స్థాన ములను మనస్సుతో భావించుతు, ఆ స్థానంలో పర మాత్మ లేక మన ధ్యేయమూర్తి ఉన్నట్లు ధ్యానం చెయ్యాలి. పర్యవసానంలో మన మనస్సును నిలపటా నికి, ఆ నిలిచిన మనస్సుతో భగవత్స్వరూపమును ఆరాధించటానికి యీ స్థానములను నిర్ణయించుకుని భావించాలి.

వి : పైన వర్ణించిన స్థానములలో మనకు ఏ స్థానం ప్రధాన మంటారు ?

కృ : హృదయకమలమునే ప్రధానంగా చేసుకో.

వి : కారణం ?

కృ : మన శరీరమనే భూభాగంలో హృదయప్రదేశము భగ వంతునకు రాజధానీనగరంవంటిది. మన శరీరంలో వుండే

డెబ్బదియొక్క వేల నాడులకు రక్తము నందించే కేంద్రము హృదయస్థానము. అందుకే ప్రధానస్థానమున కుపమానమును చెప్పవలసి వచ్చినప్పుడు గుండె కాయను ఉపమించుతారు. నేను అని మనం మన ఉత్కృష్టతను చెప్పుతూకూడా గుండెమీదనే చేయి వేసుకుని చూపిస్తాం చూచావా? ఎందుకనుకున్నావు? అదే ఆత్మస్థానము, పరమాత్మ స్థానముకూడాను.

వి : సందేహం తీరింది కాని ఒక్క మాట. మనము ధ్యానం చేయదగిన భగవంతుడు మన హృదయదేశంలోనే ఎప్పుడు నివసించే ఉంటాడంటారా? లేకపోతే వైకుంఠాది లోకములనుంచి ఆహ్వానించి మన హృదయ పుండరీకంలో వారికి ప్రత్యేకస్థానం యివ్వాలంటారా?

కృ : ఎక్కడనుంచి ఆయనను పిలుచుకు రానక్కర్లేదు. మన హృదయదేశంలోనే ఎప్పుడు ఉంటానని శ్రీకృష్ణులు సెలవిచ్చారు.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమా
యయా॥ 18. అ. 61 శ్లోకం.

"తమేవశరణం గచ్ఛ సర్వభావేనభారత
తత్ప్రసాదాత్పరాం శాంతింస్థానం ప్రాప్స్యసి
శాశ్వతం" 62

తా॥ అర్జునునకుసమస్తభూతములహృదయదేశంలోను ఈశ్వ డున్నాడని నిర్ణయించారు. అయితే ఆయన కక్కడ ఉద్యోగమేమిటంటే? అంతర్యామి రూపంలోవున్న తాను జీవులను నడుపుతూ ఉంటాడుట. దానికొక చక్కని ఉదాహరణకూడా యివ్వబడింది. ఒక భ్రమణయంత్రంపైన ఉన్నవానిని ఆ యంత్రం ఎల్లా చలింప చేస్తోందో అల్లా తన మాయాప్రభావంతో జీవులను నడుపుతూ ఉంటాడుట. అందుకని అతనినే శరణుపొందితే ఆయన అనుగ్రహంతోనే పరమ శాంతిని పొందవచ్చునన్నారు.

వి : ఒక్కమాట. మనలను ఆయనయే నడపుతున్నాడు గదా?

కృ : అవును.

వి : మరి మనం చేయవలసిన కర్తవ్యమేముంది? ఆయనను శరణుపొందినా పొందకపోయినా లేక శరణు పొందించినా పొందించకపోయినా అంతా ఆయన కర్తవ్యమే కదా?

కృ : అక్కడ పొరపాటుపడకు. నీకు కర్మయోగంలో చెప్పాను. జీవుడు రాగద్వేషములకు వశంకాకుండా శాస్త్రవిశ్వాసంతో నడవటానికి జీవుడు స్వతంత్రుడని, తాను చేసిన కర్మఫలమును ప్రేరేపించి పాకమును చెందించటానికే ఆ ఈశ్వరుడుగాని జీవుల కర్మఫలం ఆధారంలేకుండా ఆతడె జీవులకు సుఖదుఃఖముల నివ్వ

డని నిర్ణయించాను. అందుకుగాను మూడవ అధ్యాయంలో 33, 34 శ్లోకములను ఉదహరించి వివరించాను పరిశీలించుకో.

వి : నిజమే. స్మృతికి వచ్చింది.

కృ : తరువాత అడుగు.

వి : తరువాత 62 శ్లోకంలో శరణుపొందమన్నారే శరణు పొందటం అంటే నాకు అర్థంకాలేదు.

కృ : అది తరువాత చెబుతాను. ధ్యానసిద్ధి కావాలి. అందుకుగాను ముందు హృదయపుండరీకమును బాగా భావించి మూర్తి ధ్యానంలో సిద్ధిపొందు.

వి : చిత్తం. అయితే హృదయపుండరీకంలో మూర్తిభావననుగురించి బాగా చెప్పండి.

కృ : పైన చెప్పిన చక్రస్థానములలో మణిపూరకమునకు పైన, విశుద్ధచక్రమునకు క్రిందఉన్న అనాహతమునకే హృదయపుండరీకమని పేరు. అంటే నాభిదేశమునకు పైన కంఠదేశమునకు క్రిందనన్నమాట. అయితే సామాన్యంగా లోకంలో చూడబడే కమలమునకు నాళంక్రిందికి పద్మంపైకి ఉంటే హృదయపద్మం అల్లా కాకుండా నాళంపైకి పద్మం క్రిందికి ఉంటుంది. ఇది నాభికమలంకంటె పండ్రెండు అంగుళములపైన ఉంటుంది. ఆ ప్రదేశమును భావించి ఆ ప్రదేశంలో ఒక సూక్ష్మరంధ్రం ఉన్నట్లు భావించి ఆ రంధ్రంలో

ఒక దివ్యతేజమును భావించి, ఆ తేజోరాశిలో ఒక దివ్యమూర్తిని నిర్ణయించుకో.

వి : నాదమూర్తినంటూరా ? అవయవమూర్తినంటూరా ?

కృ : అవయవమూర్తినే నిర్ణయించుకో. అవతారమూర్తులలో ఒక మంగళమూర్తిని నిర్ణయించుకో. నాద బ్రహ్మనుగాని, వైశ్వానరోపాసననుగాని చేయటానికి సామాన్యులందరు అందుకోలేరు. ఉపనిషత్తులలోని వైదికోపాసనలుకూడా నేడు ఆచరణకు రావటం కష్టమే. రామకృష్ణాది విగ్రహములనైతే బాహ్యములైన చిత్రపటములను ఆధారంగా చేసుకుని ఆ చిత్రపటమందలి పాదాద్యవయవములను భావించుతూ, ఆ మూర్తిని చైతన్యవంతునిగా ఆరూఢం చేసుకుంటే చాలు. దీనిని భాగవతంలో కపిలాచార్యులు మాతృమూర్తికి ఉపదేశించినట్లు వర్ణితమైవుంది. అల్లా ఆ మూర్తిని ధారణ చేయగా చేయగా చిత్తమునకు స్థిరత వస్తుంది. దీనికి ధారణ అని పేరు. నీ చిత్తవృత్తిని ఒక ప్రదేశంలో కట్టివేయటం యీ అభ్యాసంలో ప్రధాన ఘట్టం. దీనినేపతంజలి మహర్షివారుకూడా సూత్రీకరించారు.

"దేశబంధశ్చిత్తస్యధారణా" వి. పా. సూత్రము 1.

ప్రాణాయామంతోగాని, లేక మానసిక జపంతోగాని వాయువును, ప్రత్యాహారంతో ఇంద్రియములను స్వాధీనం చేసుకుని చిత్తమునకొక మంగళ ప్రదమైన ఆశ్రయమును చూపితే ఆ చిత్తం ఆ ఆశ్రయంలో ఉండే గుణ మహిమలను,

లేదామూర్తి మాధుర్యమును గ్రహించుతూ చొక్కి స్థిర పడాతుంది.

వి : ప్రత్యాహారమంటే ఏమిటండి ?

కృ : మనం అనుభవించే సుఖములన్ని ఇంద్రియములతోను మనస్సుతోను మిశ్రమములై ఉంటాయి. అయితే ఆ రెండింటిలోను మనస్సునకే ఎక్కువస్థానం యివ్వాలి. కారణం ? ఇంద్రియములు మనస్సును అనుసరించి ఉంటాయి. ఎప్పుడైతే శబ్దస్పర్శ రూపరస గంధము లనే విషయములనుండి మనస్సును మరలించుతామో అప్పుడీ యింద్రియములుకూడా ఆ మనస్సువెంబడి మరలవలసిందే. ఎలాగంటే ? తేనెటీగలలో రాణి యీగ ఒకటుంటుంది. ఆ యీగ కనుక పైకి ఎగిరితే అన్ని యీగలు దానినే అనుసరించి పైకి లేచిపో తాయి. అది క్రిందవాలితే క్రిందకే వస్తాయి. అల్లాగే యింద్రియాలుకూడా మనస్సును అనుసరించుతాయి. అల్లా ఇంద్రియములను మనస్సు వైపుకు త్రిప్పటం ప్రత్యాహారం.

"స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఏవ ఇంద్రియాణాం ప్రత్యాహారః" సూత్రం 54.

"యథా మధుకరరాజం మక్షికాః ఉత్పతంతం అనూ త్పతంతి నివిశమానం అనువిశంతే తథా యింద్రి యాణి చిత్తనిరోధే నిరుద్ధానీత్యేష ప్రత్యాహారః ధారణాసిద్ధి అయితే ధ్యానం కుదురుతుంది.

వి : ధారణాసిద్ధి అయినట్లు గుర్తెల్లానంటారు?

కృ : ఎట్టి పరిస్థితిలోను ఉంచిన ప్రదేశంలోనించి చిత్తం కదిలిరాకుండావుంటె ధారణసిద్ధి అయినట్టు.

"ఏతదాతిష్ఠతోన్యద్వా స్వేచ్ఛయా కర్మకుర్వతః
నాపయాతియదాచిత్తం సిద్ధాంమన్యేతతాంతదా"

వి : పర్యవసానంలో ధ్యానసాధనకు ఒక అవతారమూర్తిని, స్త్రీ మూర్తినిగాని పురుషమూర్తినిగాని నిర్ణయించుకుని, ఆ మూర్తియొక్క స్వరూపమునంతా ఒక చిత్రపటంలోనించి మనస్సుకు పట్టించుకుని, ఆ మనోమయానికి సంబంధించిన హృదయస్థానమును భావించుకుని ఆ స్థానంలో యీ మూర్తిని మానసికంగా ధారణ చేయటం అవసరమని తేలింది. అంతేనా అండీ?

కృ : అంతే. ఆ ధారణచేసేటప్పుడు ప్రతి అవయవములోని దివ్య సౌందర్యమునుకూడా భావించగలగాలి. ఒక్కొక్క అవయవమునే భావించుతూపోవాలి. అందులో పాదములు మొదలు శిరమువరకు ప్రతి అవయవ సౌందర్యముకూడా భాగవతాది గ్రంథముల నుండిగాని, లేక భక్తశేఖరులు వర్ణించే వర్ణనలనుండిగాని గ్రహించి ఆ తేజోమయమూర్తిలో ప్రతినిత్యము ఒక్క సెకను కాలంనుంచి ఎంతకాలందాకా ఎన్నాళ్ళల్లో పెంచగలిగితే అన్నాళ్ళల్లో పెంచుకుంటూ ఉండాలి. ఇదంతా తన ఆత్మబలంపైన ఆధారపడి ఉంటుంది.

వి : అవయవమూర్తి విభావించటంలో విశేషాలను కొన్నింటిని చెప్పాలి తామూ.

కృ : అలాగే. కాని నీ మనస్సు ఏ మూర్తిపైన ఉల్లాసం కలిగివుందో చెప్పగలవా ?

వి : ఆ. నా బాల్యంనుంచి శ్రీకృష్ణులంటేనే నాకెంతో ఇష్టం.

కృ : అల్లాకాదు. ఆ కృష్ణబ్రహ్మమే యేరూపంలో ఉన్నప్పుడు నిన్నాకర్షించుతుందో చెప్పగలగాలి. ఎందుకంటే ? యశోదకు భయపడి కళ్ళు నులుముకుంటూ బెదరుచూపులతో తన కపటనటనా చాతుర్యమును చూపే బాలకృష్ణుని ముఖమండలం, ఆ ముఖమండలంపైన కన్నీటితో కలసిన కాటుక అంటగా ఆ మోహన మూర్తి కుంతీమహాసాధ్విని ఆకర్షించింది. అందుకని ఆ భక్తురాలు ఆ మూర్తిని సాధకుల కందించింది ఉలూఖలబంధన లీలావైభవంలోనించి.

ఉ॥ కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపిక త్రాటగట్టిన వికుంచితసాంజనబాష్పతోయధారాపరిపూర్ణవక్త్రము గరంబులబ్రాముచు వెచ్చనూర్చుచుం
బాపడవై నటించుట నామదిచోద్య మయ్యెడిన్.

అల్లాగే భక్తశేఖరుడైన భీష్ముడుకూడా ఒక దివ్యమూర్తిని ఉపాసకుల కందించారు.

అది వీరరస ప్రధానమై భక్తులపై చూపే అనుగ్రహమును ప్రకటించుతున్న కరుణారస స్వరూపనిరూపణం. పార్థసారధి యైనప్పటి దృశ్యం. అర్జునుని రక్షించటానికై భీష్ముని చంపనుంకించి చక్రమును పట్టినప్పటి మోహనమూర్తి భీష్ముని ఆకర్షించింది.

వి : ఒక్కమాట. అది యుద్ధరంగంకదా ? అప్పటిమూర్తి భీష్మునకు ధ్యేయమూర్తి ఎల్లా అయిందంటారు ?

కృ : అది భీష్ముని దృష్టిలో భౌతిక యుద్ధరంగంకాదు. అర్జునుని రథంపైనున్న సారధి తన రథమును తోలే సారధి వంటివాడుకాడు. అతను సమస్త జీవుల దేహరథములను అధిరోహించివున్న అంతర్యామియే. పార్థుని భక్తికిమెచ్చి తనవంటి వారికికూడా మోక్షము నందించదలచి. క్షత్రియులకు ఉచితధర్మమై యజ్ఞస్వరూపంలో నడిచే యజ్ఞవేదికలో కూర్చున్న యజ్ఞేశ్వరుడే ఆ పార్థసారధి. ఆ యజ్ఞేశ్వరుని లేక ఆ పార్థసారధిని అగ్నిదత్తమై తేజోమయమైన ఆ దివ్యస్యందన దేవాలయంలో ఉండగా తానధ్యయనంచేసిన ధనుర్వేదంతో వేదవేద్యుడు వేదమయుడు అయిన ఆ శ్రీకృష్ణ పరమాత్మను పూజించటానికయ్యే తాను వచ్చానని భీష్ముని హృదయం. భీష్ముడు శ్రీకృష్ణునిపై వేసిన బాణసహస్రములు కరుసుములుకులుగావు. అది

భక్తిరస ప్రధానమైన కుసుమార్చన. నీనీలదేహంతో కూర్చుని ప్రసన్న దృష్టినిబరపే ఆ పుండరీకాక్షుని తన బాణ సహస్రనామార్చనతో అరుణకమలేక్షణుని గావించి అరుణోదయ ప్రభాభానుమండలంగా ఆయన దేహకాంతిని మార్చగా ఆ అప్రాకృత దివ్యమంగళ విగ్రహమెల్లాఉంటింది! అవివీరరసభక్తిరసములక భేదా వ్యవసాయం కలిగిన భీష్ముడు రసస్వరూపమైన కృష్ణ బ్రహ్మమును పూజించారు. అంతే. అది యుద్ధం కాదు. శ్రీకృష్ణులున్నది యుద్ధరంగం కాదు. అది ధర్మక్షేత్రం. కాబట్టనే అంత్యకాలంలో భీష్ముడు యుద్ధరంగంలో విహరించిన మోహనమూర్తిని స్మరించాడు. తనకు దిక్కైనవాడు తనను చంపటానికి అర్జునుని రక్షించటానికి వచ్చే మూర్తేనన్నాడు చూచావా! భీష్ముని దృష్టి నేను పైన చెప్పినది కాకపోతే యుద్ధంలో నాడు చూచిన దృశ్యమాయన కీనాడు అంపశయ్యపైన బాధలనందుతున్నప్పుడూ స్మృతికి వస్తుందా!

భీష్ముని వర్ణనం చూడు.

సీ. కుప్పించి యెగసినకుండలంబులకాంతిగగనభాగంబెల్ల
గప్పికొనగ
నురికిన నోర్వకయుదరంబులోనున్న జగముల వ్రేగున
జగతిగదల
చక్రంబు చేపట్టిచనుదెంచురయమున, బైనున్న
పచ్చని పటము జార

నన్ స్మృతి నాలావునగుబాటుసేయకు, మన్నింపు మని
క్రీడిమరలదిగువ
గరికిలంఘించుసింహంబుకరణిమెరసి, నేడు భీష్ముని
జంపుదు నిన్నుగాతు
విడువు మర్జునయనుచు మద్విశిఖవృష్టి దెరలిచనుదెంచు
దేవుండుదిక్కునాకు.

అర్థమైందా ?

వి : చక్కగా తెలిసింది. కాని అధునాతన భక్తులెవరైనా కృష్ణబ్రహ్మముయొక్క మోహనమూర్తులను అందించారంటారా ?

కృ : అందించకేం? లీలాశుకులు బాలమురళీకృష్ణ పదపంకజ మధురరసాస్వాదన తుందిలమై మధురగాన నినాదమును చేసినారు శ్రీకృష్ణ కర్ణామృతమనే పేరుతో. అందులో ముగ్ధమధుర బాల్యచేష్టలలో ప్రౌఢవయో విశేష శృంగార విలాసములను, కపట బాలసుందర విగ్రహములోని అద్భుతసౌందర్య గరిమను వర్ణించారు. కృష్ణకర్ణామృతంలో లీలాశుకులు వర్ణించిన మూర్తులు కూడా కృష్ణధ్యాన సాధకులకు ధ్యేయమూర్తులు కావచ్చు. ఆ మూర్తు లాతనికి సాక్షాత్కరించిన మూర్తులు. అతడు కేవలము కవికాడు. భక్తుడై ఆ మూర్తి విలాసములను దర్శించినవ్యక్తి. ఒకచోట ఇలా వర్ణించాడు.

శ్లో॥ పాదౌ పాదవినిర్జితాంబుజవనౌ పద్మాలయాలంకృతౌ
పాణీ వేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియా
బాహూ దోహదభాజనం మృగదృశాం మాధుర్య
ధారాగిరో
వక్త్రం వాగ్విభవాతిలంఘిత మహో బాలం కి
మేతన్మహః॥

ఆయన మననంలో ఒక దివ్యతేజః పుంజము గోచరించింది. ఆహా ! ఈ సుందర సుకుమార తేజఃపుంజ మెవ్వరిది ? అనుకుంటూ ఉండగానే ఆ వెలుగులోనించి. సౌందర్యరాశినుండి విడివడిన ఒకభాగంగా తామర తంపరలను జయించి, లక్ష్మికి ఆటపట్టై, ఆశ్రితులకు లక్ష్మీప్రదములై సుకుమార సుందరారుణ కాంతులనీను పాదములు రెండు గోచరించినాయి. ఆచరణ సరోజకాంతులకు ముగ్ధుడైచూస్తూ ఉండగానే శిల్పలక్ష్మికి చివరిమెట్టై పిల్లనగ్రోవిలో స్వర బ్రహ్మను సాక్షాత్కరింపజేస్తున్న పాణిద్వంద్వముయొక్క దర్శనమబ్బింది. స్వేచ్ఛాసంకల్పంతో నిర్మించుకున్న ఆ అచింత్యరచనా శిల్పనైపుణి ఎవ్వరి నాకర్షింపదు ?

ఆ భక్తశేఖరుని చిత్తమక్కడ నిల్వగా ఆ మూర్తియొక్క భుజస్కంధములు దర్శనమైనాయి. అవ్వి కాంతలనే లతానికుంజములకు దోహద క్రియలు. అందుకే బాలికలు కూడా ఆ భుజస్కంధముల మధ్యలో కౌగలించబడితే అప్పటి కప్పుడే అకాలంలో పుష్పించే వృక్షవాటికల్లాగ ప్రౌఢాంగనలై పోవలసిందే. అల్లా ఆ అవయవముల సోయగమును తిల

కించు చుండగానే మధుధారలను కురిసే ముఖమండలంలో నించి మధురవాఙ్మయం వినిపించుతోంది. ముగ్ధుడైనాడు లీలాశుకుడు. ప్రథమంగా బాలకృష్ణుని రూపమును తేజో రూపంగా భావించాడు. ఆ నిరవధిక తేజఃపుంజంకన్నులకు మిరు మిట్లు గొలపగా ఆ అనన్య సామాన్య తేజస్సులోనించి కాలు సేతులతో కూడి పసిబిడ్డడైయున్న బాలకృష్ణుడే కనబడ్డాడు. ఇటువంటి తేజస్సు యే బాలుర కుంటుంది? అందుకే "అహో బాలం కిమేతన్మహః" అని ఆనందాతిరేకంతో పలికారు. కాబట్టి భగవత్సాక్షాత్కారంతో భగవద్రూపములను వర్ణించిన చిత్రకారుడు లీలాశుకుడు.

వి : చిత్రం. నాకు బాలమురళీకృష్ణుడే ధ్యేయమూర్తి.

కృ : ఆ విగ్రహమునే ధ్యానించు. ధ్యానించేటప్పుడు పాదములను భావించుతూ పాదములందు తెల్లని గోళ్ళను. అడగుదమ్ములయందు వజ్ర, అంకుశ, యవ, పద్మ రేఖలను భావించు. పాదపద్మముల సుకుమారమును తలుస్తూ, తెల్లని గోళ్ళకాంతులవలన నీ హృదయ కుహరంలోఉండే అజ్ఞానమనే చీకట్లు పోయినట్లు భావించు. అంతేకాదు. ఆ పాదపద్మముల మహిమను వర్ణించుకో.

ఆ పాదపద్మములనుండి వెడలివచ్చిన గంగను శిరమున ధరించి శివుడు శివశబ్దానికి లక్ష్యమైనాడు. శివమనగా మంగళం. అంతేకాదు. ఆ పాదములు తనను ధ్యానం చేసేవారియొక్క మనోమలమనే పర్వతమునకు వజ్రాయుధ

మట. ఇల్లాంటి భావనలను ఆపాదపద్మ ధ్యానంలో భావించాలి. ఏ స్వరూపభావనను చేస్తున్నా సరే యీ భావనలు అవసరమే. ఆపాదాది శిరఃపర్యంత వర్ణనమంతా భాగవత తృతీయ స్కంధంలో కపిలదేవహూతి సంవాదంలో ఉంది. ఇల్లాగే ఒక మహాకవి శ్రీదేవీచరణకమలములను వర్ణించాడు:

"ప్రవాళానాం దీక్షాగురు రపిచ లాక్షారుణరుచాం
నియంత్రీ బంధూకద్యుతినికరబంధూకృతిపటుః
నృణా మంతర్ధ్వాంతం నిబిడ మపహర్తుం తవ కిల
ప్రభాతశ్రీ వేషా చరణరుచివేషా విజయతే॥"

తల్లీ ! నీ పాదపద్మములయందలి ఎరుపుదనము చిగురుటాకులకు దీక్షయిచ్చిన గురువు. లత్తుకను నీ విట్లుండుమని నియమించిన నియంత. అట్లే బంధూకపుష్పమున కాత్మబంధువై, నిన్ను ధ్యానించువారి హృదయగుహాలలోనుండు అజ్ఞానాంధకారమును పోగొట్టు ప్రభాత లక్ష్మివలెనున్నదని వర్ణించి ధ్యానించాడు. పాదతలములందలి అరుణిమను భావించాడన్న మాట.

వి : కవి వాఙ్మయశిల్పి యన్నమాట.

కృ : అవును. శిల్పిచెక్కిన శిలావిగ్రహమునకుపతనమున్నది. కవి వాఙ్మయశిల్పమునకు పతనమెక్కడిది ? ఆతని విజ్ఞానశిల్పము ఆచంద్రతారకము. అందుకే శంకరులు గావించిన దేవతా స్తోత్రములన్ని సగుణ నిర్గుణ బ్రహ్మాలకమూల్యాలంకారములై పండిత పామరులకు నేటికిని శిరోధార్యములై వెలసినవి.

వి : ఒక్క మనవి. శంకరు లీధ్యానసాధనను గురించి ఏమైనా చెప్పారా?

కృ : చక్కని ప్రశ్నను వేశావు. మంచి విషయమును స్మృతికి తెచ్చావుకూడ. శంకరులవాణిని విను ధ్యాన సాధననెంత సుందరంగా వర్ణించారో.

శ్లో॥ ధ్యానాంజనేన సమవేక్ష్య తమఃప్రదేశం
భిత్వా మహాబలిభి రీశ్వరనామ మంత్రైః
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యే పాదపద్మమిహ తే శివ తే కృతార్థాః ॥

భగవత్పాదారవిందములనే నిధిని దర్శించటానికి ధ్యానయోగ మొక అంజనమట. భూగర్భంలో ఉండే నిధులను చూడటానికి కాటుక ఉంటుంది. ఆ కాటుక నిధిపై కప్పిఉన్న ఆవరకమును తొలిగించుతుంది. అందుకని భగవత్పాదములనే నిధి దర్శనమునకు ధ్యానమొక కాటుకవంటిదన్నారు. ఆ ధ్యానయోగిచేసే మంత్రానుష్ఠానము, నామస్మరణాలు ఆ నిధిని తీయునప్పుడు ఇచ్చే బలులట. అల్లా ధ్యానాంజనంతో భగవద్దర్శనంకాగా కృతార్థతను లోతేముంటుంది? అల్లా చూచినవారే కృతార్థులన్నారు.

వి : ఒళ్ళు పులకరించుతోందండి మీరు అందించిన వర్ణనలతో.

కృ : కవి వాఙ్మయంకూడా భగవంతుని విభూతులలోదే.

వి : విభూతులంటే?

కృ : భగవంతుని సమగ్రమైన ఐశ్వర్యము అవతారమూర్తుల కుంటే అందలి అంశాంశములు యీ చేతన సృష్టి లోని కొన్ని ఉపాధులయందు కనపడుతూ ఉంటాయి. ఆ అంశాంశములనుకూడా చూచినప్పుడు సాధకుడు పూర్ణరూపుని స్మృతికి తెచ్చుకోవాలి.

అందుకే భగవానులు మన గీతాశాస్త్రంలో తన విభూతులను ప్రత్యేకంగా వర్ణించారు.

వి : అంటే సామాన్య పదార్థంలోకంటే ఆ వర్ణించబడ్డ వస్తువులలో భగవదంశం బాగా భాసించుతుందన్న మాట.

కృ : అవును.

వి : ధ్యానసిద్ధికి గుర్తేమిటండి?

కృ : మనచేత ధ్యానింపబడే వస్తువుతప్ప అన్యవస్తువు కన బడకుండా ఉండటమే సిద్ధి.

వి : కన్నులు మూసినప్పుడా? తెరిచినప్పుడా?

కృ : తెరిచినప్పుడు మూసినప్పుడు కూడా.

వి : ఎన్నాళ్లకో?

కృ : ఎన్ని జన్మలకైనా ఫరవాలేదు. పోతనగారీసిద్ధినే కోరు కున్నారు.

వి : శెలవివ్వాలి వారి కాంక్ష.

కృ : చ. నగు మొగమున్ సుమధ్యమును నల్లని మేనును లచ్చి కాటప
ట్టగునురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియు కృపారసదృష్టియు గల్గు వెన్ను డి
మ్ముగ బొడసూపు గాత గనుమూసినయప్పుడు విచ్చి నప్పుడున్.

ఇదే ధ్యానంతో యీ నాటికి గోష్ఠిని ముగించుదాం.

కృష్ణానంద విజయులిద్దరు శాంతిపాఠంతో నాటి గోష్ఠిని సమాప్తంచేశారు.



ఓమ్

నాల్గవరోజు

# భగవద్విభూతులు

కృష్ణానంద విజయులిద్దరు ఏకాంత ప్రదేశంలో కూర్చు న్నారు. విజయుడు వందన సమర్పణాంచేసి గురువర్యులను ప్రశ్నించుతున్నాడు.

వి : స్వామీ! భగవద్విభూతులలోని ప్రత్యేకతను గురించి చెప్పాలి తమరీరోజున.

కృ : అలాగే. ఒక్కసంగతిని మాత్రం గుర్తుపెట్టుకో. భగ వంతుని విభూతులకు పరిమితిలేదు అని స్వామివారే అన్నారు.

"నాంతోఽస్తిమమదివ్యానాం విభూతీనాం పరంతప"
అ. 10. శ్లో. 40.

వి : గీతాశాస్త్రం చెప్పిందికదా?

కృ : అంతకంటె ఎన్నో ఉన్నాయి. భాగవత ఏకాదశ స్కంధంలోకూడా వర్ణించబడ్డాయి. అయినా మనం కొన్నింటిని గురించి విచారించుదాం.

వి : గీతలోకూడా సంగ్రహించుదామంటారా?

కృ : వీలువెంట చూద్దాం.

వి : చిత్తం. అసలు విభూతులను వర్ణించి చెప్పటంలో స్వామివారి హృదయ మేమిటంటారు?

కృ : ఏముంది ? ఉపాసకుల హృదయాలలో అనేక రూపము లలో భగవన్మూర్తులను ప్రవేశింప చేయుటమే విభూతుల వర్ణనకు ప్రయోజనం.

వి : పదియవ అధ్యాయమేగదా ? విభూతులున్నది ?

కృ : సప్తమాధ్యాయంలోకూడా కొన్ని విభూతులు వర్ణింపబడ్డాయి. అసలు గీతలో విభూతులను వర్ణించిన శ్లోకములు మొత్తం 22. 7వ అధ్యాయంలో నాలుగు శ్లోకములు, పదియవ అధ్యాయంలో 18 శ్లోకములు వర్ణించబడ్డాయి. ముఖ్యంగా యీ విభూతులద్వారా ఆధారాధేయ భావములు వర్ణించబడ్డాయి.

వి : ఆధారాధేయభావములంటే నా కర్థంకాలేదు.

కృ : ఉదకములున్నాయనుకో, ఆ ఉదకములలో రసమున్నది. ఆ రసమును ఆధారంగాచేసుకుని ఉదకములున్నాయా ? లేక ఉదకముల నాధారంగా చేసుకుని రసమున్నదా ? అని ప్రశ్న. ఈ ప్రపంచకారణమును నిర్ణయించటంలో తర్కశాస్త్రజ్ఞులొకరు. వారు రసమనునది గుణమని చెప్పి, ఆ గుణముకలవి ఉదకములు గనుక ఉదకములు రసమనే గుణమునకు ఆశ్రయమన్నారు. మన గీతాశాస్త్రమల్లా చెప్పదు. జగత్కారణము పరబ్రహ్మ. పరబ్రహ్మను ఆధారంగా చేసుకునే యీ భౌతిక ప్రపంచమంతా ఉంది. కాబట్టి ఉదకములందున్న రసము కేవలము గుణముకాదు. అది తన్మాత్ర. ఆ రసము భగవంతుడనైన నేనే. నన్ను

ఆధారంగా చేసుకుని యీ స్థూల ప్రపంచమంతా వుంది అన్నారు స్వామి. కాబట్టి యీ భౌతిక ప్రపంచమును చూచునప్పుడుకూడా భగవంతుడే గోచరించాలి ధ్యానయోగులకు. ఇది విభూతివర్ణనంలో ముఖ్యోద్దేశం. మరొక్క మాటగాకూడా చెబుతాను విను. ఏ పదార్థ మును చెప్పి, ఏ పదార్థమందలి శక్తి నేను అని చెబు తున్నారోస్వామి ఆ శక్తియే దాని కాధారమన్న మాట. ఆ ఆధారమే భగవంతుడు.

వి : చిత్తం. తరువాత సెలవివ్వండి.

కృ : ముఖ్యంగా నీ సాధనభాగంలో స్మృతిలో ఉంచుకొన దగిన శ్లోకభాగమును అందించుతున్నాను. జాగ్ర త్తగా గ్రహించు.

వి : చిత్తం.

కృ : శ్లో॥ మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణాఇవ.
7. అ. 7. శ్లోకం.

ఈ అనంత విశ్వములో నేనుగాని వస్తువు అణుమాత్రం కూడా లేదని నొక్కి వక్కాణించారు కృష్ణపరమాత్మ. అయితే స్వామీ నిన్ను ఏ రూపంలో చూడాలి ? అంటే చక్కని ఉదాహరణము యిచ్చారు. మణులన్ని దారంపైన ఆధారపడి ఉన్నట్లుగా యీ జగత్తు నామీద ఆధారమని తెలుసుకోమన్నారు. అంటే సృష్టి స్థితి లయములకు నేనుతప్ప

వేరొక ఆధారంలేదని చెప్పారు. ఈ ఊహను ఏ క్షణంలోను మరచిపోగూడదు సాధకుడు.

వి : స్వామీ ! పరమాత్మ అంతటా వ్యాపించి ఉన్నారు గదా ? ఆ విభూతులను మాత్రమే తాముగా ఎందుకు వర్ణించారు ?

కృ : విద్యుత్తు అంతటా వ్యాపించిఉన్నా దానిని ప్రసారం చేసే తీగలలో కనబడదు. బల్బుపెట్టినప్పుడే కనబడు తుంది. అల్లాగే భగవంతుడుకూడా తాను వర్ణించిన విభూతులను ఆరాధించేవారికి తొందరగా దర్శన మిస్తాడు.

వి : అన్ని పదార్థములు సృష్టిలో భగవన్నిర్మితములై నప్పుడు విభూతులలోనే తొందరగా దర్శనంకావటం ఏమిటండి ?

కృ : అన్ని లోహములే అయినా రాగియందే విద్యుత్ ప్రసారమౌతుంది. అది అంతే.

వి : చిత్తం. విభూతులను చెప్పండి.

"రసోహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవస్సర్వ వేదేషు శబ్దః ఖేపౌరుషంనృషు. 7. 8౹

ఉదకములలో రసము, సూర్యచంద్రులలోని కాంతి, వేదములయందలి ఓంకారము, ఆకాశమునందలి శబ్దము, మను జులయందున్న పుంబుద్ధి, యివన్ని ఆయన స్వరూపాలే. అలాగే భూమియందలి గంధము, అగ్నియందలి దీప్తి, ప్రాణి

కోటిలోని జీవభావము, తాపసులందున్న తపస్సు నేనే అన్నారు.

సమస్త భూతములకు సనాతనమైన బీజమును నేనే.

వి : సనాతన బీజమేమిటి ?

కృ : బీజమంటే కారణమని అర్థం. భూత సృష్టికి కారణం నేను అని.

వి : తరువాత ?

కృ : బుద్ధిమంతులలో వివేచనా శక్తి, కార్యసమర్థులలోని ప్రాగల్భ్యము, బలవంతులలో కామరాగములు లేని బలము, జీవయాత్రకు మాత్రమే అవసరమై శాస్త్ర నిషిద్ధములు కాని కోరికలు ఆయన స్వరూపములేనట. 11 శ్లో. ఇంతవరకు 7 వ అధ్యాయంలో శ్లోకాలు.

వి : కొంచెం ఆగండి. ఇక్కడ కామము, రాగము అనేవి రెండుగా వర్ణించబడ్డాయిగదా ? ఆ రెంటికి తేడా ఏమిటంటారు ?

కృ : తనకు దగ్గరలోలేని విషయములందలి ఆశ కామం. సంభవించిన విషయములందు కలిగే ప్రీతికి రాగమని పేరు. అల్లా రాగమునకు ఆశకు సంబంధించకుండా శరీరపోషణకు మాత్రమే ఉన్న బలం నేను అన్నారు. అంటే రాగాంధులై ఆశాపాశములచే బంధింపబడి సంసారంలో మునకలు వేసేవారిలోని బలము అజ్ఞాన మూలకంకావటంచేత ఆ బలము భగవద్విభూతిగా

వర్ణించబడ లేదు. రాక్షసులలో బలము భగవద్విభూతి లోనికి రాదు. ఆహారవిహారములనుకూడా శరీరమాత్ర పోషణకే కోరుకుంటే ఆ కోరిక భగవద్విభూతి అవుతుంది. లేకపోతే రాక్షసమౌతుంది. అందుకే మహాత్ముల శరీర బలంగాని, భారతీయధర్మాను ననుసరించిన గృహస్థ ధర్మావలంబులైనవారి బలంగాని, ఆధ్యాత్మిక సంపదను అందించగలుగుతుంది. తన బలమును పరులను పీడించుటకై పెంపొందించుకున్న హిరణ్యాకశ్యపుడు, రావణుడు, కీచకులు మొదలైనవారి శరీర బలములు నింద్యములని చెప్పటమే దీని హృదయం.

వి : బాగుంది.

కృ : సూర్యులు పండ్రెండుమంది. వారిలో విష్ణువు అనే ఆదిత్యుడు, ప్రకాశింపజేయు వస్తువులలో సూర్యుడు, మరుద్గణంలో మరీచి అనే మరుత్, నక్షత్రములలో చంద్రుడు, వేదములలో సామవేదము, దేవతలలో ఇంద్రుడు, ఇంద్రియములలో మనస్సు, బుద్ధి వృత్తి ఆయన స్వరూపములు.

వి : మనస్సునకు బుద్ధికి తేడా ఏమిటంటారు ?

కృ : సంకల్పరూపమైన వృత్తికి మనస్సని, సంకల్పించిన విషయమును నిశ్చయించిన వృత్తికి బుద్ధియని పేరు.

ఏకాదశ రుద్రులలో శంకరుడు, యక్ష రాక్షసులలో కుబేరుడు, అష్టవసువులలో అగ్నియనునాతడు. పర్వతములలో మేరుపర్వతము, పురోహితులలో బృహస్పతి, సేనానాయకు

లలో కుమారస్వామి, సరస్సులలో సాగరము, మహర్షులలో భృగువు, వాక్కులలో ఓంకారము, యజ్ఞములలో జప యజ్ఞము, స్థావరములలో హిమవత్పర్వతము, వృక్షములలో రావిచెట్టు, దేవర్షులలో నారదుడు నేనే నన్నారు.

వి : భృగుమహర్షి వారి ప్రత్యేకత ఏమిటి?

కృ : ఒకప్పుడు త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరు లలో ఎవరు గొప్పవారు? అని ప్రశ్నరాగా వారి ముగ్గురను పరీక్షించుటకు వెళ్ళి పరీక్షించిన మహాను భావుడు భృగువు. అదిగాక పరశురామావతారం యీ భృగు వంశంలోనిదే.

వి : వాక్కులలో ఓంకారమన్నప్పుడు వాక్కులంటే ఏవి అంటారు?

కృ : వాక్కులనగా వేదవాక్కులు. ఆ వాక్కులలో అద్వి తీయమై వెలసినది ఓంకారం. అంతేకాక కొన్ని పద ములు కలిస్తే వాక్యమౌతుంది. కొన్ని అక్షరములు కలిస్తే పదమౌతుంది. ఆ పదములలో ఒకే అక్షరం గల పదము ఓంకారము.

వి : ఒక్క సందేహం. ఇప్పుడు అనేక భాషలు, ఆ భాష లలో పదసమూహములు ఉన్నాయిగదా. ఈ భాషా కోశములన్ని ఆ కృష్ణుని కాలంలోకూడా ఉన్నాయం టారా?

కృ : నీవా పిచ్చిలో పడకు. సృష్టి, సృష్టిలోని పద పదార్థ విజ్ఞానముకూడా అనాదే. అంటే మొదలులేనిదే. మన

వేదమాత, పదజాలమునంతను రెండు భాగములు క్రింద విభజించింది. ఒకటి వైదికము, రెండు లౌకికము. ఈ రెండు భాగాలుకూడా లెక్కకు మిక్కిలిగానే ఉన్నాయిగాని పరిమితంగా లేవన్నది.

వి : అయితే యీనాడు కన్పట్టే అన్ని భాషలు దైవనిర్మితములేనంటారు ?

కృ : సందేహంలేదు. ఒక పదమును నీవు పలకటంతోటే ఒక పదార్థం నీకు బోధకు వస్తోంది. ఆవు అనగానే ఆవును తెలుసుకుంటున్నావు. ఆ పదానికే అది అర్థమని ఎవరు చెప్పారు ? ఆ పదార్థమును తెలియజేసే శక్తి నీవు పలికిన పదంలోఉంది. శక్తిలేని పదమును ఎవరైనా ఉచ్చరించితే ఆ పదము పదార్థమును బోధించదు. కొన్ని అక్షరములు కలిస్తే పదము, కొన్ని పదములు వాక్యముగదా ? లంమర. ఈ పదమునకు అర్థమున్నదా ? లేదు. "రాముడు కుండ గోడ" ఈ వాక్యము నీకేమైనా అర్థమును చెబుతోందా ? లేదు. కాబట్టి "శక్తం పదమ్." ప్రతి పదమునకు శక్తి అనేది ఒకటి ఉంది. ఇక్కడ శక్తి అనగా యీ పదమునకు యీ అర్థము అని ఈశ్వరుడే సృష్టికాలంలోనే నిర్ణయించాడు. లేకపోతే నదీ శబ్దమునకు నది అని అర్థం ఎల్లా వచ్చింది ? అన్ని దేశములోను యీ శబ్దమునకిదే అర్థంగాని వేరొక అర్థం లేదుగదా? కాబట్టి పదపదార్థ సంబంధమును కల్పించినవాడు ఈశ్వరుడే.

మరొక్క సంగతినికూడా చెబుతాను. కాళిదాస మహా
కవి రఘువంశ మహాకావ్యంలో పార్వతీ పరమేశ్వరు
లకు నమస్కరించుతూ,

శ్లో॥ "వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌవందే పార్వతీపరమేశ్వరౌ."

పార్వతీపరమేశ్వరులు, శబ్దము, శబ్దార్థము ఎల్లా కలసి ఉంటాయో అల్లాంటి వారట. అంటే ఎప్పుడు వారు విడిగా ఉండరు. ప్రకృతి పురుషులు ఏకరూపులే. శక్తి శక్తిమంతు లకు భేదంలేదని నిర్ణయించాడు. అధునాతననామలు సృష్టి యొక్క అనాది సిద్ధాంతమును అర్థంచేసుకొనపోవటంతో ఆది మానవులు అక్షరాల నెరుగరని క్రమంగా వర్ణములను ఏర్ప రచుకున్నారని పిచ్చిమాటలన్ని చెబుతూ ఉంటారు నమ్మకు. శ్రీరామచంద్రులు సీతకు తన నామాక్షరములుగల ఉంగర మును పంపారు. మహాభారతంలో అర్జునుడువేసే బాణసమూ హంపైన అర్జునుని నామము చెక్కబడి ఉన్నట్లు వర్ణితమై ఉంది. అంతేకాకుండా శ్రుతి యిల్లా అన్నది. *పదజాల మంతా ప్రణవరూపంలోను, సంస్కృత అపశబ్దరూపంలోను ఉన్నదట. అయితే ఆ అపశబ్దరూపములైనవేవి? అంటే ప్రాకృతము, పైశాచికము మొదలైన పేర్లతో వ్యవహరించ బడుతున్నాయట. సంస్కృతం కానిదంతా ప్రాకృతమే. ఆ ప్రాకృతంలోవే హిందీ మొదలైన భాషలు. అయితే యీ

---

శ్రుతి : అనంతామంతా ఒధివిర్మితాం మహీం ఏకాక్షరాం ద్విప దాగ్ం షట్పదాంచ.

ప్రణవ సంస్కృత ప్రాకృతాది వాఙ్మయమంతా ఎక్కడనుండి వచ్చింది? అంటే పరమేశ్వరునుంచే వచ్చిందని వేదం చెబుతూ ఉంది.

వి : అయితే మన ఇతిహాసాదుల వాఙ్మయంకూడా ఆ కాలపు వారిచేత క్రొత్తగా సృష్టించబడ్డది కాదన్న మాటేనా?

కృ : కాదు. గట్టిగాకాదు. అల్లా అనేవారికి భగవద్గీతను ముట్టుకునే అధికారంకూడా లేదు.

"యుగాంతేం తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః
లేభిరే తపసాపూర్వంఅనుజ్ఞాతోస్వయంభువా"

అని ఆర్ష వాక్యం. అంటే యుగాంతములలో అంతర్ధానములై లయములైపోయిన వేదములను, ఇతిహాసములను కూడా మనమహర్షులు తపస్సుచేసి, చతుర్ముఖ బ్రహ్మగారి అనుజ్ఞతో తిరిగి సంపాదించారని యీ శ్లోకమునకర్థం. సృష్టిలో ఉన్నవన్ని ప్రళయకాలంలో సంస్కారరూపంలో ఉండి మళ్ళీ సృష్టిలోకి వస్తూ ఉంటాయి. కాబట్టి పరమార్థం బాగుపడాలంటే అధునాతన చరిత్రకారుల పైత్యాన్ని కొనుక్కోకు.

వి : చిత్తం. సందేహమును తీర్చుకున్నాను. మీ గోష్ఠిలో నాకు నిర్ణయంగా తేలింది ఏమంటే మన భారతీయ ప్రాచ్య సంస్కృతికి ఒక శాశ్వతత్వమున్నదని, అధునాతన అభివృద్ధివాదుల లోకనిర్ణీత సిద్ధాంతంలేదని,

వీరు క్షణక్షణ పరిణామ హృదయులని అర్థమైంది. తరువాత చెప్పండి.

గంధర్వులలో చిత్రరథుడు, సిద్ధులలో కపిలమహాముని గుఱ్ఱములలో ఉచ్చైశ్రవము, ఏనుగులలో ఐరావతము మనుజులలో రాజు నా విభూతులేనన్నారు.

వి : రాజు భగవద్విభూతేనన్నమాట.

కృ : ఇంకా సందేహం ఎందుకు. భారతీయరాజ్యాంగ శిక్షాస్మృతులన్ని వేదపురుషుని ఆదేశములే. వాటిని పాలించటానికి వేదవేద్యుడైన భగవంతుడే రాజుగా ఉన్నాడని మన చరిత్ర చెబుతుంది. రాగబద్ధుడై విషయభోగములనే ప్రధానంగా చేసుకున్న రాజు కాదు. అట్టిరాజు వేనుడనే వాడొకడున్నాడు పూర్వ రాజుల చరిత్రలో. అట్టివానిని ఋషులంతా కలసి శాసించి, ధర్మవీరుని సృష్టించారు ఆతని శరీరమును మథించి.

వి : రాజుపైన ఋషుల కధికారమున్నదన్నమాట.

కృ : రాజుకన్న ఋషులయందు భగవచ్ఛక్తి అధికంకావటం చేత రాజు తప్పుతోవనుపట్టినప్పుడుఋషులరూపంలో శాసించాడు భగవంతుడు. కాబట్టి రాజు భగవంతుని విభూతి. రాజులో అగ్ని, యమ, వరుణ, ఇంద్రాది దేవతల శక్తులన్నీ ఉన్నాయి. దీనిని గురించి భారతం అరణ్యపర్వంలో ఒక కథను చెబుతాను.

అత్రి అనే ఒక బ్రాహ్మణుడు తపస్సుకు వెళ్ళదలచి భార్యను అడిగాడు. నీవు నాతో అరణ్యమునకు వస్తావా? పుత్రులదగ్గర ఉంటావా? అని. ఆమె పుత్రులకు జీవనవిధానమును ఏర్పరచకుండా మీరు అరణ్యమునకు వెళ్ళటం ధర్మం కాదన్నది. అందుకని మాంధాతవద్దకు వచ్చి రాజును—

ఉ. నీవ విధాత విం్రదుడవు నీవ సమస్తజనేశ్వరుండవున్
నీవ యశేషధర్మములు నీవెరుంగుదు నిన్ను బోలగా
నీవసుధాతలంబున మహేశ్వరు లెవ్వరు లేరు సన్మునీం
ద్రావళి మెచ్చ నిన్నుగొనియాడు పరిస్ఫుటవాక్య
భంగులన్.

అని స్తుతించాడు. అంతలో గౌతమమహాముని ధనార్థివై అల్లా స్తుతించుతున్నావు అది ధర్మంకాదనగా, ఆ రాజు కొలువుకూటంలోఉన్న సదస్యులందరు సనత్కుమారమహర్షి వారివద్దకు పోయి యీ వివాదమును చెప్పగా అత్రి చెప్పినది అతిశయోక్తి కాదు న్యాయమేనని తీర్పుయిచ్చారు. కనుక రాజు భగవంతుని అంశ.

తరువాత విను. ఆయుధములలో వజ్రాయుధము, ధేనువులలో కామధేనువు. కామములలో పుత్రోత్పత్తికైనకామం, సర్పములలో వాసుకి భగవంతుని విభూతులు.

వి : కామందగ్గర అర్థంకా లేదు.

కృ : స్త్రీ సుఖమును అనుభవించుటకు మాత్రమే అయిన కామం కాకుండా వంశవిచ్ఛేదను కాకూడదని శ్రుతి

విధించింది కనుక ఆ విధి ననుసరించి పుత్రులను ఉత్పా దించుటకై అనుభవించే కామం భగవదంశ.

నాగులలో శేషుడు, జల దేవతలలో వరుణుడు, పితరు లలో అర్యముడు అనే పితృరాజు, ధర్మాధర్మ ఫలముల నిచ్చు వారిలో యముడు స్వామి అంశలే.

వి : పితరులంటే మన తాతలేనా ?

కృ : కాదు. దేవ పితరులని మనుష్య పితరులని రెండు విధ ములు. పితృలోకమునకు ప్రభువులుగా ఉన్నవారు దేవ పితరులు. మృతినిపొంది వారి పుణ్యావిశేషంతో ఆ లోకములకు వెళ్ళిన జీవులు మనుష్యపితరులు. మన తండ్రులు మొదలైనవారన్నమాట.
తరువాత విను.

దైత్యులలో ప్రహ్లాదుడు, లెక్కింపులలో కాలము, మృగములలో సింహము, పక్షులలో గరుత్మంతుడు, వేగమైన వాటిలో వాయువు. శస్త్రధారులలో రాముడు, జంతువులలో మొసలి. నదులలో గంగ. విద్యలలో తత్వవిద్య. వాద, జల్ప వితండాది తర్క విశేషములలో వాదము, వర్ణములలో అకారము, సమాసములలో ద్వంద్వ సమాసము, కాలము లలో అఖండకాలము, సృష్టికర్తలలో హిరణ్యగర్భుడు జగ ద్గురువుల అంశలే.

వి : వర్ణములన్నిటికంటే అకార విశిష్టత ఏమిటి ?

కృ : వర్ణములన్ని మంత్రబీజములే అయినా అకారం బ్రహ్మ బీజం కావటంచేత ప్రణవంలో అకారం మొదటి

మాత్ర కావటంచేత అకారము సర్వదైవత మాతృక మని వర్ణించారు.

స్త్రీలలో కీర్తి, లక్ష్మి, వాక్కు, స్మృతి, మేధా, ధైర్యము, ఓర్పు, వీరందరు ఆయన విభూతులే.

వి : వీరందరు స్త్రీలా ? గుణములేమో ?

కృ : సృష్టిలో వీరంతా స్త్రీలింగ అధిష్ఠానములుగానే వర్ణించబడ్డారు. వీరినికూడా ఉపాసించటం అవసరం. మేధా దేవతను ఆరాధించటానికి తైత్తిరీయోపని షత్తులో మంత్రములున్నాయి. బహు గ్రంథముల లోని విషయములను ధారణచేయుట మేధ.

“బుద్ధియు, ధృతియును నీతియు శ్రద్ధయు సన్నతియు క్షమము శాంతియుననగా—

వృద్ధశ్రవ యోద్భూరు మద్వృద్ధిప్రద దేవతలు శ్రుతి
స్మృతికధితల్.

సామములలో బృహత్సామము, ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు మాసములలో మార్గశిరము,ఋతువులలో వసంతము భగవద్విభూతులు.

వి : మాసములలో మార్గశిరమునకు ఋతువులలో వసంత మునకు ప్రాధాన్యత ఏమిటంటారు ?

కృ : మార్గశిర మాసములో భూమి సస్యశ్యామలంగా ఉంటుంది. ఆ సంపదంతా భగవద్రూపమేకదా? అది కాక ఆ మాసంలో రవి ధనస్సుకురాగా గోపాంగన

లంతా కాత్యాయనీ వ్రతమును ఆచరించి, ఆ వ్రత ఫలంగా పరమాత్మతో రాసక్రీడా మహోత్సవమును గావించారు. అలాగే వసంతంలో యజ్ఞకర్మలను చేయువారంతా యజ్ఞమూర్తిని ఆరాధించుతారు. అంతేగాక ప్రకృతి యావత్తూ చిగురుటాకులతోను, పుష్పగుళుచ్ఛములతోను విరాజిల్లుతూ చూపరుల కొక దివ్యరూపమును ధరించిన పరాప్రకృతిగా విరాజిల్లుతూ ఉంటుంది. ఇవి వీటి ప్రత్యేకత.

వృష్ణివంశంలో వాసుదేవుడు, పాండవులలో ధనంజయుడు, మునులలో వ్యాసులు, కవులలో శుక్రుడు, మానవులకు క్రమశిక్షను అందించుటకై యేర్పడిన శిక్షాదండము, ధర్మజయమును సాధించుటకై ఏర్పరచిన నీతి (అనగా ఉపాయము) ఇవికూడా భగవద్విభూతులే.

వి : గీతను చెప్పిన కృష్ణులు, విన్న అర్జునుడు, వ్రాసిన వ్యాసులు ముగ్గురు ఒక్కరేనన్నమాట.

కృ : అన్ని విభూతులు కలిపి ఒక్కడే అయితే ముగ్గురు ఒక్కడు కాదా ?

వి : ఉపాయం తెలిసి లోకయాత్రను సాగించేవారిలో భగవదంశ ఉన్నమాట.

కృ : ఇక్కడ కొంచెం పొరపాటుపడకు. ధర్మమునకు విజయమును చేకూర్చుటకై వినియోగించిన నీతినే భగవదంశంగా చెప్పాను.

వి : అంటే ? ధర్మమన్నా నీతియన్నా ఒకటికాదా ?

కృ : కాదు. ధర్మము శాశ్వతమైనది. నీతి నికాలానుగుణ్యాముగా వాడవచ్చును.

వి : నైతికపతనమంటే ధర్మపతనం కాదన్నమాట.

కృ : కాదు. ధర్మము వేదప్రతి పాద్యము. నీతి మనుష్య బుద్ధి సంజనితము. వైదిక ధర్మరక్షణకొరకు నీతిని వాడాలి. భారతయుద్ధంలో శ్రీకృష్ణులు ధర్మవిజయంకొరకు నీతిని ప్రయోగించారు. ఆ నీతినే దుర్యోధనుడు స్వార్థమునకై తన భోగములకై దురాశతో పాండవులపైన వాడాడు. అది రాక్షసం.

చివరిమాట—

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవం

అన్నారు శ్రీకృష్ణులు. లోకంలో ఏది ఐశ్వర్యయుక్తమో భోగాన్వితమో తేజోరూపమో అదంతా నా విభూతే నన్నారు.

వి : ఒక్కమనవి. ఇతరదేశీయులు ఈ ఘట్టంలో మనలను చాలా ఆక్షేపించుతున్నారు. చెట్లను రాళ్ళను దేవుడులాగా పూజించుతారు భారతీయులని.

కృ : నీవు అటువైపు తిరగకు. ఇతరదేశీయులు మనలను ఆక్షేపించుటను గురించి,వారి ఆక్షేపణలను వారిచరిత్రలను ఆధారంగా చేసుకుని మనవారు మాట్లాడే మాటలను గురించి ఒక్క సంఘటనను చెబుతాను.

ఒకప్పుడు కొంగలు, హంసలు దైవికంగా ఒకచోట కలిసినాయట. కొంగలు మీరుండే ప్రదేశమెక్కడ? అన్నాయట. మానససరోవరం మా నివాసమన్నాయట హంసలు. అయితే మరి మీకు ఆహారమేమిటి? అన్నాయి కొంగలు. తామరతూండ్లు మా ఆహారమన్నాయి రాజహంసలు. మీరు నత్తలను ఎరుగుదురా? వాటి రుచి మీకు తెలుసునా? అన్నాయి బకములు. నత్తపురుగులా? అబ్బే వాటిని మే మెరుగమన్నాయి హంసరాజములు. కొంగలన్ని పకపకా నవ్వినాయి. మీరు నత్తనే ఎరుగరా? అని. అల్లాగే స్థావర జంగమాత్మక ప్రపంచమంతా చైతన్యాత్మకంగా భావించి, గడ్డిపరక మొదలు చతుర్ముఖ బ్రహ్మపర్యంతము ఎవరినైనా పరమాత్మగా పూజించవచ్చునన్న మహోన్నత భారతీయ సిద్ధాంతం అర్థంకానివారంతా ఏ దేశంనుంచో ఆర్యులు యీ దేశమునకు వచ్చినారని, ఆ ఆర్యులు ఇల్లాంటివారు, అల్లాంటి వారు అని వ్రాసే వంకర వ్రాతలు మనకెందుకు? వాటి వంక కూడా చూడకు. విశ్వరూపుడైన భగవంతుని వంకచూడు. ఆయన అనుగ్రహామునకు పాత్రుడవుకా. ఇదే యీనాటి నా ఉపదేశం.

వి : ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



ఓమ్

**అయిదవరోజు**

# భగవదనుగ్రహము

విజయుడు కృష్ణానందులకు వందన మాచరించి గోష్ఠిని ప్రారంభించారు.

వి : మహాశయా! యీ నాటి మన గోష్ఠి ధ్యానయోగము. లేక ధ్యానసాధనలోని భాగము. భగవంతుని మంగళ విగ్రహునిగా గ్రహించి హృదయసీమలో ఆయన అవయవ శోభను ధారణ చేయవలసినదిగా చెప్పారు. తరువాత ఆ భగవద్భావనను, కేవలము ఆ విగ్రహము నందేగాక ఆయన అంశములతో వెలుగొందుతూ ఉండే కొన్ని పుణ్య ఉపాధులనుకూడా ఆయనగానే భావించమన్నారు. తరువాత నా కర్తవ్యమేమి టంటారు?

కృ : తరువాత నీవు ధ్యానించే ధ్యేయమూర్తి యీ జగత్తు కంటె చాలా పెద్దవాడని నిర్ణయించుకో. ఆ భగవంతునియొక్క ఏకాంశమే, ఒక్క కళామాత్రమే యీ స్థూల జగత్తు. ఆ భగవంతుడీ ప్రదేశంలో ఉన్నాడు ఆ ప్రదేశంలో లేడు అన్న భావం అక్కర్లేదు. జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. ఆ విషయమునే శ్రీకృష్ణులు పార్థునకు బోధించారు పదవ అధ్యాయం చివర.

శ్లో॥ "అథవాబహునై తేన కింజ్ఞా తేనతవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేనస్థితో జగత్

ఇన్ని మాట లెందుకు? యీ విభూతులలోనేకాదు. అంతటా నిండిఉన్నాను. ఈ స్థూల ప్రపంచము నాలో ఏక దేశము అర్జునా! అన్నారు. ఈ భావమును అందుకోటానికే ఆధ్యాత్మిక వాఙ్మయము ఉపాసనాకాండను మనకందించింది. అర్జునునకీ భావమును చెప్పటంకాక అనుభవంలోకూడా విశ్వరూప సందర్శనంచేసి యీ జగత్తంతా తనలో ఒక్క అంగుళంమేరలో ఉన్నదన్నట్లు తెలియజేశారు. భగవంతుని వ్యాపకత్వమును గురించి భాగవతంలోని ఒక ఘట్టమును నీకు జ్ఞాపకం చేస్తాను. అది ప్రహ్లాద చరిత్ర. హిరణ్యకశ్యపుడు నీ విష్ణువు ఎక్కడున్నాడు? అన్న ప్రశ్నకు ప్రహ్లాదుని సమాధానం.

మ. కల డంభోధి గలండుగాలి గలడాకాశంబునం గుంభినిం
గల డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలడోంకారమునం ద్రిమూర్తుల ద్రిలింగవ్యక్తులందంతటం
గలడీశుండు గలండు తండ్రి వెదకంగానేల యీయాయెడన్

క. ఇందు గలడందు లేడని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన నందందే గలడు దానవాగ్రణి వింటే.

వి : అర్జునునకు అనుభవంలోకి రావటానికి విశ్వరూపమును చూపారు స్వామివారే అన్నారు మీరు. కాని అర్జునుని పైన కలిగిన అనుగ్రహంవంటి అనుగ్రహము భగవానునకు నాపైన కలగాలిగదా?

కృ : అది భగవంతునిలో లేదు. ఆయన అనుగ్రహమును సంపాదించటం అనేది నీలోనే ఉంది. జీవుడే భావంతో ఆయనను సమీపించుతాడో ఆయనఅంత సన్నిహితుడై ఉంటారా భావంతోనే.

వి : జీవుడే భావంతో ఆయనను సమీపించుతాడో ఆ భావంతోనే వారిని సమీపించి అనుగ్రహించుతారన్నమాట నా కర్థంకాలేదు.

కృ : జీవులు భగవంతునిదగ్గరకు నాలుగు విధములైన పుణ్యపురుషులు వెళుతారు. ఎవరు?

"చతుర్విధాభజంతేమాం జనాస్సుకృతినోర్జున.
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచభరతర్షభ. 7 అ. 16 శ్లో.

అర్జునా! నన్ను పుణ్యాత్ములైన నలుగురు భక్తులు సేవించుతారు అన్నారు. వారెవరు? అంటే చెప్పారు—ఒకడు ఆర్తుడు, అనగా ఆపదలో ఉన్నవాడు. గజేంద్రునివంటి వాడన్నమాట. రెండు జిజ్ఞాసువు. ఈ సంసారంలోనుంచి బయటపడటం ఎల్లాఅని బాధపడేవాడు. మూడు డబ్బుకావాలన్నవాడు. అర్థార్థి: రాజ్యంకావాలని ధ్రువుడుతపస్సుచేశాడు గదా? అల్లాంటి వ్యక్తి అన్నమాట. నాల్గవవాడు జ్ఞాని. వారు సనకసనందాదులవంటివారు. అల్లాంటి నలుగురిలోను

జీవు డెందులోవాడైతే భగవంతుడందుకే వస్తాడు జీవుని వద్దకు. ఆయనకు ప్రియులు లేరు శత్రువులు లేరు.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తిన ప్రియః॥ అ. 9. శ్లో. 29

వి : కాని ఆయన అనుగ్రహమును సంపాదించటం చాలా కష్టమనుకుంటాను.

కృ : చాలా తేలిక. స్వామివారి సందేశం విను.
"అనన్యచేతాస్సతతం యోమాంస్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్యయోగినః
అ. 8. శ్లో. 14

ఎవడు ఏకాగ్రమైన మనస్సుతో దీర్ఘకాలంగా నన్ను ధ్యానించుతాడో అట్టివానికి నేను చాలా సులభంగా అందుతానన్నారు. అంతేకాదు అల్లా నన్ను ధ్యానంచేసే వారి బాధ్యతనంతా తానే వహిస్తారట.

"అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం.

అనన్యమైన చిత్తంతో యే జనులు తనను ఉపాసించుతారో నిరంతర ధ్యాననిష్ఠులైన వారి యోగక్షేమములను నేనే వహించుతానని వారి ప్రతిజ్ఞ.

వి : అనన్యత్వమంటే ఏమిటండీ ?

కృ : అద్వైతసిద్ధాంతంలో ఆ పరబ్రహ్మకంటే నేను వేరుగా నన్న భావమే అనన్యత్వమౌతుంది.* ప్రస్తుతము నీవు అనుష్ఠించుచున్నది జీవేశ్వర భేద దృష్టి. సగుణంలో భగవంతుడు తప్ప తన శరీర దృష్టిగాని, దారాపుత్రాదుల దృష్టిగాని లేకుండా తన సుఖమునువీడి తన ధ్యేయమూర్తియొక్క ఆనందమే తన ఆనందముగా చూడగలగటం అనన్యత్వమౌతుంది. ఒక్క క్షణం కూడా ఆ ధ్యేయవస్తువును విడనాడి ఉండలేని స్థితికి అనన్యత్వమని పేరు.

వి : యోగక్షేమములంటే ?

కృ : యోగమనగా లేనిది రావటం, క్షేమమనగా ఉన్న దాని రక్షణము.

వి : బాహ్యప్రపంచమంతా వదలి సన్యాసికావాలన్న మాటే.

కృ : అక్కర్లేదు. సాధకుడు బాహ్య ప్రపంచవృత్తులను మెల్ల మెల్లగా వదలుతూ ధ్యానభాగమునకే ఎక్కువ కాలమును యిస్తూ ఉండటమే అవసరం. ఒక్కమాటుగా విషయములనన్నిటిని ఒక్కపూటలోనే వదలాలన్నది అక్కర్లేదు. అది కుదరదుకూడా. అందుకే స్వామి వారు.

* అనన్యాః అపృథగ్భూతాః పరందేవం నారాయణం ఆత్మత్వేన గతాః సన్తః చింతయంతఃమాం, యేజనాః సన్యాసినః శం, భ,

"శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతి గృహీతయా ॥

విషయ ప్రపంచంమీదనుంచి లేదా సంసారవాసనలను ఒక్కసారిగా వదలదు నీ బుద్ధి వృత్తి. అందుకని మెల్ల మెల్లగా సాధించాలన్నారు. సాధకుడు తాత్కాలికావేశంలో వదలి, తనను ఆ సంసార వాసనలు వదలినవని అనుకున్నప్పటికి అవి బీజరూపంగా అంతఃకరణలో నిలిచి ఉంటాయి. వాటిని త్రోసివేయదగిన ధైర్యమును మెల్ల మెల్లగా బుద్ధివృత్తికి చేకూర్చాలి. కొందరు అరణ్యములకు వెళ్ళినా తిరిగివస్తారు. మహానుభావులైన భక్తులు కొందరు గృహస్థులైకూడా అనన్య భక్తితో భగవంతుని సేవించారు. బాహ్యప్రపంచమును అంతఃకరణలో వదలాలిగాని స్థూలంగా అక్కర్లేదు. కుచేలుడు, త్యాగరాజు, రామదాసు మొదలైన వారెందరో గృహస్థాశ్రమంలో ఉండి విషయప్రపంచమును వీడి అనన్య చిత్తంతోనే భగవానుని సేవించారు. భగవదనుగ్రహపాత్రులైనారు.

వి : ఒక్క సందేహం. కుచేలుడు అర్జునుని స్థానంలోకి వస్తాడంటారా భగవానుని దృష్టిలో.

కృ : నిస్సందేహంగా. నీవు ఒక్క విషయమునుమాత్రం మరవకు. సాధకుడు, సిద్ధుడు యిద్దరుంటారు. సాధకుడు భగవంతునియొక్క అనుగ్రహమును సంపాదించటానికి నైవేద్యమును అందించుతాడు. సిద్ధుడు భగవంతుని పరిపూర్ణానుగ్రహమును పొందిఉండి స్వామికి నివేదనను సమర్పించుతాడు. సాధకుడు ప్రార్థించవలసిం

దెల్లా అంటే స్వామీ నీ అనుగ్రహ సంపాదనలో కృతార్థులై సిద్ధులైనవారి చేతినుంచిఎల్లాంటిభావంతో అందుకుంటున్నావో నా చేతిమీదనుంచి యిచ్చే నివేదననుకూడా అల్లా అందుకోమని ప్రార్థించాలి.

వి : సిద్ధుల నివేదన వరుస ఉందా స్వామి ?

కృ : ఒక మహానుభావుడా వరుసలోని భక్తబృందమును వర్ణించి నన్నుకూడా అందులో చేర్చుకో అన్నారు భగవంతుని. ధ్యేయమూర్తిని. ఆ జాబితాను విను.

శ్లో॥ యా ప్రీతి ర్విదురార్పితే మురరిపో కుంత్యర్పితే యాదృశీ
యాగోవర్ధన మూర్ధ్ని యాచ పృథుకే స్తన్యే యశోదార్పితే.
భారద్వాజసమర్పితే శబరికాదత్తేధరే యోషితాం.
యాప్రీతి ర్మునిపత్నిభక్తిరచితేఽప్యత్రాపి తాం తాం కురు.

విదురు డందించిన ఆతిథ్యమును, కుంతి పెట్టిన భోజనమును, గోవర్ధనాద్రిని యెత్తినప్పుడు గోపకులు పెట్టిన అన్నాదులను, కుచేలుని అటుకులను, యశోద అందించిన స్తన్యమును, భారద్వాజునీందులిచ్చిన ఆతిథ్యమును, శబరి యిచ్చిన ఫలములను, గోపికలిచ్చిన అధరరసమును, ముని భార్యలు పెట్టిన అన్నమును ఎంత ప్రీతితో పరిగ్రహించావో యీ కర్ణామృతమును అంత ప్రీతితో అందుకోమని ప్రార్థించాడు లీలాశుకుడు.

వి : వీరంతా ఒక జాబితాలోవారా? అబ్బా!

కృ : కుచేలుని అటుకులను పరమాత్మ అడిగితీసుకుని తిన్నాడు. అర్జునునకు కుచేలునకు తేడాయేముంది? భగవంతుని హృదయసీమలో వారంతా ఒకే స్థానమును సంపాదించుకున్న యోగులు.

వి : శబరి ఆటవికజాతిలోనిది కాదండి?

కృ : అవును. ధ్యాన, భక్తి సాధనలో భగవదనుగ్రహమును పొందటానికి జాతికి ప్రత్యేకత ఏమీలేదు. అంతఃకరణకేస్థానంగాని స్థూలశరీరతః అధికారతారతమ్యంలేదు. కర్మాచరణలో జన్మకాల వయోభేదములున్నాయి. భక్తిసాధనకు వచ్చేటప్పటికే ఆ పరిధులను దాటుతుంది శాస్త్రసమూహాం.

"నాస్తితేషు జాతివిద్యారూపకులధనక్రియాది భేదః"

నారదభక్తి సూత్రం 32.

జాతి, విద్య, సౌందర్యము, కులవిశేషము, ధనవిశేషము మొదలైనవేవి లేవన్నారు నారదులు. ఈ విషయంలో ఒక్క శ్లోకమును వినిపించుతాను.

"వ్యాధస్యాచరణం ధ్రువస్యచ వయో విద్యా గజేంద్రస్యకా?
కుబ్జాయాఃకిమునామరూపమధికం కింవా సుదామ్నో ధనం
వంశఃకో విదురస్యయాదవపతే రుగ్రస్యకింపౌరుషం
భక్త్యాతుష్యతి కేవలంనచగుణైఃభక్తిప్రియోమాధవః.

ధర్మవ్యాధుడు కటికివృత్తిని చేస్తాడు. ధ్రువుడు బాలుడు. గజేంద్రునకు విద్యరాదు. కుబ్జది వంకర శరీరం. కుచేలునకు ధనమేమున్నది? యాదవపతియయిన ఉగ్రసేనుడు బలవంతుడు కాడు. అయినా వీరందరు భగవానుని దృష్టిలోని వారే.

వి : గీతలో స్వామివారేమన్నా రీవిషయంలో.

కృ : ఒక గొప్ప గీతమునే గానంచేశారు.

"అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః
అ. 9. శ్లోకం 30.

ఎంత దురాచారవంతుడైనా ఎట్టి నింద్యకర్మల నాచరించేవాడైనా సరే అనన్యభక్తితో నన్ను సేవించగా వాడు నింద్యుడుగాడు. అట్టివానిని సాధువుగానే పరిగణించుతాను. అతడల్లా పరిగణించటాని కర్హుడే అవుతాడు.

వి : భక్తుడుగావుంటూ ఎన్ని దురాచారములకు పాల్పడ్డా భగవంతుడు క్షమించుతాడన్నమాట.

కృ : తప్పు. దాని అర్థం అదికాదు. లోగడ జీవితంలో దుర్మార్గుడై తన జీవితమున మార్పురాగా పశ్చాత్తాపమునొంది, ఆ దుర్వ్యాపారములనన్నిటిని త్యజించి ధ్యానయోగియై, భక్తిసిద్ధికై ప్రయత్నించుచున్న వ్యక్తిగాని, ప్రయత్నించినవ్యక్తిగాని పూర్వచరిత్రలనుబట్టి నింద్యుడుకాడని అర్థం. ఇల్లాగే అంత్యకాల

స్మరణ విషయంలోకూడా చాలామంది పొరపాటు అర్థమును చెబుతూ ఉంటారు అజామిళుని కథలో.

వి : ఏమిటది ?

కృ : భాగవతంలో అజామిళుడనే బ్రాహ్మణుని కథవుంది. అతడు చక్కని వేదవేదాంగపారగుడై, ధర్మాచరణం చేస్తూ ఉండగా మధ్యజీవితంలో మార్పువచ్చింది. అతడొకరోజున సమిత్పుష్పఫలములను తేవడానికి అరణ్యమునకు వెళ్ళాడు. ఆ సందర్భంలో ఒక వ్యభిచారులైన స్త్రీ పురుషులు ఒక పొదరింట్లో రతిక్రీడను చేస్తున్నారు. ఆ దృశ్యం యీ అజామిళుని దృష్టిలో పడింది. వెంటనే ఆతనిచిత్తము ఆ స్త్రీ పైకి దుమికి కామాసక్తమైంది. అప్పుడజామిళుడు ఆ అధర్మము నుంచి చిత్తమును మరల్చటానికి చాలా ప్రయత్నం చేశాడు. కాని సాధ్యంకాలేదు. ఇల్లావుంది భాగవతంలో-

శ్లో॥ స్తంభయన్నాత్మనాత్మానం యావత్సత్వం యథా శ్రుతం,

న శశాక సమాధాతుం మనో మదనవేపితం.

భాగ. స్కం. 6. అ. శ్లో. 62

తనకున్న శాస్త్రబలంతో మనస్సును గట్టిపరచి ఆ త్రోవనుంచి మరల్చటానికి ప్రయత్నం చాలా చేశాడు. అయినా మదనాగ్ని ఆతని ధర్మసంస్కార చిత్తమును దగ్ధం చేయగా, ఆదుష్ట స్త్రీయందలి కామబీజములనే వృద్ధినిచెందిం

చింది ప్రాక్తన ప్రారబ్ధం. అంతతో అతడు ఆ స్త్రీతో నేపుండి బిడ్డలనుకూడా కని, జాతిభ్రష్టుడైనాడు. ఆతని పుత్రులలో ఒకని పేరు నారాయణుడు. అతడిపైన ప్రేమ యీతనికిమెండు. ఎప్పుడు ఆ పుత్రుని పిలుస్తూ ఉండేవాడు. అల్లా ఉండగా అంత్యకాలం వచ్చింది. యమదూతలు దర్శనమిచ్చారు. ఆ భయంలో తన పుత్రుని పిలిచాడు. అతడువస్తే వీరిని అవతలకు తొలగలడని. ఆ సందర్భంగా విష్ణుదూతలువచ్చి యమదూతలను అవతలకు పొమ్మన్నారు. వారికి వీరికి ఘర్షణ జరిగింది. అంత్యకాలంలో ఎల్లా అయినా భగన్నామమును ఉచ్చరించాడు కనుక అజామీళుడు పుణ్యమూర్తియని విష్ణుదూతల వాదం. పూర్వచరిత ఇదియని యమదూతలవాదం. ఈ సంవాదం విని అతడు మళ్ళీ బ్రతికాడు. అంతతో ఆతనికి పశ్చాత్తాపం కలిగింది. వెంటనే తన అజ్ఞానమును తొలగించుకుని యమాదిసాధనములతో ధ్యాననిష్ఠుడై సాధుసంగమంతో గంగాద్వారంలో ముక్తుడైనాడు. అంతేగాని అంత్యకాలంలో నారాయణ అన్న వెంటనే మోక్షం రాలేదు. అంత్యకాల నామస్మరణ ఘోరపాతకములకు ప్రాయశ్చిత్తమైంది. అల్లాగే ఎప్పుడైనా శాస్త్రనింద్యములైన దురాచారములనుండి మరలందే భక్తిగాని, జ్ఞానంగాని, ధ్యానంగాని ఏది సిద్ధించదు.

వి : ఒక్క సందేహం. భక్తుడందించే పదార్థం ఏదైనా సరే భగవంతుడందుకుంటాడా ?

కృ : అంటే ?

వి : భగవన్నివేదనచేసే పదార్థములు శుచిర్భూతములుగా ఉండాలని, ఉల్లి మొదలైన నిషిద్ధ పదార్థములను నైవేద్యం పెట్టకూడదని శాస్త్రములు చెబుతున్నవి గదా ? మరి తిన్నడు మాంసమును పెట్టినట్లు చెబుతారు. శబరి ఎంగిలిపండ్లు నిచ్చిందంటారు. పైగా మీరు గోపికలు అధరరసమునుకూడా నైవేద్యం క్రిందికి తెచ్చారు. వాటికి ఎంగిలిలేదా? స్వామివారికి నిషేధ పదార్థాలంటూ లేవా ? అని నా సందేహం.

కృ : మంచి ప్రశ్ననే వేశావు. భగవాను లన్నమాట ఏమంటే—

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మేభక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః.
అ. 9. శ్లోకం 26.

క. దళమైన పుష్పమైనను ఫలమైనను సలిలమైన బాయని భక్తిం
గొలిచిన జనులర్పించిన నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.
భాగ. స్కం. 10.

పై శ్లోకమునకు క్రిందిపద్యమే అర్థం. శాస్త్రమెప్పుడు కర్తయొక్క అధికారము ననుసరించి సిద్ధాంతములను చెబుతుంది. ఒక విషయమును శాస్త్రం చెప్పిందన్నా ఒక చరిత్రను ఇతిహాసం వర్ణించిందన్నా అధికారభేదమును విమర్శిం

చాలి. సామాన్యసాధకుడు భగవంతుని గౌరవించవలసిన అర్హ తలోవున్న భక్తుడు నైవేద్యము సంపాదించటంలో శాస్త్రనిషిద్ధ ఆహారములను తాను తినకూడదు. భగవన్నివేదనను చెయ్య కూడదు. భగవంతుని పిలవటంలోను, ఆయనతోటి పొత్తు లోను ఓ రామచంద్రప్రభూ! అని పిలిచి వారిని గౌరవ దృష్టిలో సేవించేవారున్నారు. ఏమిరా! నాయనా! నన్నిల్లా ఏడిపించుతున్నావు యీ ద్రోహబుద్ధి నీకు తగునటరా? అనే వారు ఉన్నారు. వండేపదార్థము, సంపాదించే పదార్థము తనకు కాదు, తన కత్యంత ప్రీతుడైన భగవంతునకే తయారు చేసేవారు ఉన్నారు. తమకు కావలసిన పదార్థమును తమరే భుజించటం శాస్త్రసమ్మతం కనుక నివేదనచేసి తినాలన్న ధర్మదృష్టితో నైవేద్యం పెట్టేవారు ఉన్నారు. వీరిద్దరిలో చాలా తేడావుంది తెలుసా నీకు?

వి : చాలా తేడావుంది. ఒకరి భావంలో తాను లేడు. తన కత్యంత ప్రియమైన వ్యక్తియే ఉన్నాడు. రెండవ వానిలో తాను ఉండి తను ఆచరించదగిన ధర్మముంది.

కృ : తాను లేకుండా తన కత్యంత ప్రేమాస్పదవస్తువే దృష్టిలో ఉన్నవే శబరిపండ్లు, తిన్నడు మాంసము. తిన్నడు మాంసనివేదన మెల్లాంటిదో ఆతని భావ దార్ఢ్య మెల్లాంటిదైతే స్వామివారా నివేదనను పరి గ్రహించారో చెబుతాను విను.

తిన్నడు భిల్లజాతికి చెందినవాడు. అతడు వేటాడబోయి తన స్నేహితులను వీడి శివలింగమును దర్శించాడు. తిరిగి

యింటికి రాలేదు. ఆ లింగరూపుడైన పరశివుడక్కడ ఎవ్వరు లేని నట్టడవిలో ఉండటం భరించలేకపోయినాడు. అడిగాడా లింగమూర్తిని—

శా. ఓ సామీ! యిటువంటి కొండదరిలో నొంటింబులుల్ సింగముల్
గాసింబెట్టెడు కట నట్టడవిలో గల్జువ్విక్రీనీడ నే
యాసం గట్టితివేటి గడ్డపలుకు! నీవాకొన్నచో గూడు నీ
కెవ్వసుట్టంబులు దెచ్చిపెట్టెదరు నీకిందేటికే లింగమా!

స్వామీ! ఇల్లాంటి అడవిలో ఉన్నావు. నీకు ఆకలి అయినా దప్పిక అయినా అన్నం, నీళ్ళు ఎల్లా? అని జాలి బడ్డాడు. తన పల్లెకు రమ్మన్నాడు. ఆతనికి ఆ లింగము రాయిగా కనపడిందా? లేదు. వాళ్ళయింట్లో మంచి మాంసము లున్నాయన్నాడు. ఉడుమూరు రమ్మని ఆహ్వానించాడు పార్వతీపతిని. "ఉడుమూరికి రాగదవయ్య లింగమా!" మరొక్క ఘట్టం చెబుతాను ఆ భక్తశేఖరుని పూజావిధానం.

ఈశ్వరున కభిషేకంచేసి నైవేద్యం పెట్టాలి. అందు కని యిల్లా వచ్చాడు. చంకలో విల్లు, అమ్ములపొది వీపున, అభిషేకం చెయ్యవలసిన సువర్ణముఖీనదిలోని ఉదకం నోట పుక్కిట బట్టాడు. వండిన మాంసం దొప్పల్లో పెట్టుకుని ఆ దొప్పలు దోసిలిలో ఉంచుకొని వచ్చాడు. అది అతడు నైవేద్యం చెయ్యటానికి స్వామి నగ్గరకొచ్చిన స్వరూపం.

కాలి చెప్పుతో అదివరలోవున్న పూజాద్రవ్యమును తుడిచి, నిర్మాల్యంపోయిన తరువాత పుక్కిటిబట్టి తెచ్చిన

నీళ్ళతో లింగమును అభిషేకించాడు. దొప్పలలోవున్న మాంసమును నోటిదగ్గర పెట్టి, ఉద్ధరిణ్ణతోనో పుష్పాతోనో ప్రాణాయస్వాహా అని చూపించటంకాదు తినమన్నాడు. ఆయన తినలేదు. మాట్లాడలేదు. అంతతో ఊరుకున్నాడా? ఇల్లా అంటాడు.

"కాలవో క్రొవ్వవో మాడంగాలెనో చవిగావో కమ్మ
గావో సికున్
జాలవోయలవడవో తినవేలా కరుకుపుట్లు పార్వతీశ్వర
చెపుమా ?

పాపం నా పదార్థంలో లోపం ఉందికాబోలు అనుకున్నాడు. అడిగాడు. చెప్పలేదు. ఆకలికాలేదేమో అనుకున్నాడు. తన భక్తిలో లోపం వచ్చిందనుకున్నాడు. తన్ను బాధపెట్టవద్దని ప్రార్థించి తినిపించాడు. అది సిద్ధభక్తుల నైవేద్యం. ఈ తిన్నని భక్తి అద్వైతాచార్యులైన శంకరుని ముగ్ధుని చేసింది. శంకరులంటారుగదా ?

శ్లో॥ మార్గావర్తితపాదుకా పశుపతేరంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే,
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే,
భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసా
యతే.

భక్తశేఖరుడు అడవిలో తిరుగాడగా అరగిపోయి చిందరవందరగా ఉన్న కాలి చెప్పు శివుని పవిత్రాంగమున కూర్చగా అయింది. (కుంచె) పుక్కిటిబట్టి ఉమిసిన జలము

త్రిపురారికి దివ్యాభిషేకంగా మారింది. మాంసం ఎల్లాఉందో ఉడికిందో లేదోనని కొరికి తినగా మిగిలిన మాంసం అపూర్వ నై వేద్యమైంది. బోయవాడు భక్తశిరోమణియైనాడు. భక్తి ప్రభావమెంతది! అన్నారు.

ఇక శబరి సంగతి. శబరి ఎంగిలి పండ్లను అప్పుడు కొరికి పెట్టలేదు. అల్లా లేదు వాల్మీకి రామాయణంలో. ఆ పండ్లను పది సంవత్సరాలుగా పోగుజేసి తేనెలో మాగ వేస్తోంది. చెట్టునుంచి కోసేటప్పుడే ఆ పండు పక్వమునకు వచ్చింది లేనిది తినిచూచి మిగిలిన పండ్లను యేరి యేరి కోసి ఉండవచ్చు. ఆ శేషమునకే ఎంగిలి పండ్లన్న ప్రతీతిరావచ్చు. శబరి విషయంలో తిన్నదివలె ప్రసిద్ధచరిత్ర రామాయణంలో కనబడదు.

వి : పత్ర పుష్ప ఫల సమర్పణలలో ఫలము శబరి కథలో కనబడుతోంది. మిగిలినవాటినికూడా ఎవరెవరు సమర్పించి కృతార్థులైనారో తెలవిస్తారా ?

కృ : అల్లాగే. పత్రమును సమర్పించినది ద్రౌపది.

వి : ఏ సందర్భంలోనండి ?

కృ : పాండవులు ద్వైతవనంలో ఉన్నారు. దుర్యోధనుడు దుర్వాసమునీంద్రుని ఆరాధించి ప్రసన్నులుకాగా వేయిమంది శిష్యులతో పాండవుల దగ్గరకు ఆతిథ్యానికి వెళ్ళమన్నాడు. పాండవులవద్ద సూర్యుడిచ్చిన తామ్ర పాత్ర ఉంది. అది ఎంతమంది అతిథులకైనా సమారాధనను చేయిస్తుంది. కాని ద్రౌపది భుజించి

ఆ పాత్రను కడిగిన తరువాత మాత్రం దానికి అక్షయ శక్తి ఉండదు. ద్రౌపది భోజనం అయిన తరువాత వెళ్ళమన్నాడు దుర్యోధనుడు. అప్పుడు దుర్వాసుడు భోజనంపెట్టకపోతే శపించుతాడు. అల్లా పాండవులను శాపదగ్ధులను చేయించాలని పంపాడు. ఒకరోజున పాండవులు సుఖాసీనులై ఉన్నారు. ద్రౌపదికూడా భుజించి కూర్చుంది. దుర్వాసమునీంద్రులు శిష్యులతో సహా వచ్చారు పాండవులవద్దకు. దుర్యోధనుడక్కడ పాండవులు దుర్వాస శాపదగ్ధులైనట్లుగానే భావించు తున్నాడు పాపం! మునీంద్రులు రావటంతోడనే ధర్మ రాజుగారు అర్ఘ్యపాద్యములతో దుర్వాసుని అర్చించి ఆతిథ్యంకొరకై స్నానమునకు పంపారు. ద్రౌపది యిప్పుడు ఆతిధ్యమివ్వాలి. ఏం చేస్తుంది? ఏకాం తంగా కూర్చుని శ్రీకృష్ణభగవానుని విశ్వవ్యాపకు నిగా ధ్యానించింది. తన ప్రక్కనే కూర్చున్న రుక్మిణిని వదలిపెట్టి వెంటనే వచ్చారు ద్వైతవనానికి. రావటం తోటే నమస్కారంచేసి తన బాధనంతా చెప్పింది ద్రౌపది. శ్రీకృష్ణులు ముందు ద్రౌపదీ!నాకు భోజనం పెట్టు అన్నారు. పాత్ర సంగతి చెప్పింది. నీవు నాతో హాస్యమాడుతున్నావు. ఆ పాత్ర తెచ్చి నాకు చూప మన్నారు. చూపించింది. ఆ పాత్రలో ఒక మూల ఉన్నది శాకలేశం. అదిచాలు నా చేతిలోపెట్టి ఉదకం వెయ్యమన్నారు. అలాగే చేసింది. దుర్వా సాదులందరు సంతృప్తులు కావాలని నోట్లో వేసు

కొన్నారు భగవాలులు. దుర్వాసుని శిష్యులం
లందరు గంగలో మునిగి లేచేటప్పటికల్లా త్రేపులు
వస్తున్నాయి. ఆశ్చర్యపడి గురువుగారితో చెప్పారు:
దుర్వాసమునీంద్రుల గుండె అదిరిపోయింది. తన జీవి
తంలో ఒకప్పుడు జరిగిన అంబరీషుని ఘట్టం జ్ఞాపకాని
కొచ్చింది. ధర్మజాదులు తపోనిష్ఠులుగదా! యీ
సందర్భంలో తనను వారే దగ్ధంచేస్తారనే భయం
కలిగి శిష్యులకు చెప్పాడు. అంతకు పూర్వమే సహ
దేవుని పంపారు ధర్మజులు వారిని పిలవమని. సహ
దేవుని చూచి ఆశ్చర్యపోయినారు. ఎలా అయి
నాయి వంటలని. శిష్యులేరి? పారిపోయినారు. సహ
దేవుడు కొంతసేపటికివచ్చి వృత్తాంతం చెప్పారు.
అయినా ధర్మజులు నమ్మలేదు. అర్ధరాత్రి సమ
యంలోకూడా రావచ్చు ముని. ఆయన స్వభావం
అది. ఇలా ఉండగా శ్రీకృష్ణులు జరిగినదంతా
ధర్మజునకు చెప్పారు. భయంలేదన్నారు.
ఇది ద్రౌపది పత్రసమర్పణ ఘట్టం. పుష్ప
మును గజేంద్రుడిచ్చాడు. ఫలమును శబరి. ఉదకం
సంగతి విను. రంతిదేవుడొక మహారాజు. అతడు ఇహ
లోక భోగములను వదలి, పరలోక భోగములను వదలి
ధనమంతా పేదలకు, దీనులకు యిచ్చి నిరుపేదవై
నాడు. అదొక విచిత్ర దినము. అప్పటికి నలుబది దిన
ములనుంచి భోజనంలేదు. పాపం! కాని చివరి రోజున
రంతిదేవుడు ఎలాగో సంపాదించుకున్న ఆహారమును

భుజించబోతున్నాడు. అంతలో ఒక బ్రాహ్మణుడు అతిథియై వచ్చాడు. తనకున్నదానిలోనే సగమిచ్చి పంపాడు. ఆ బ్రాహ్మణుడు వెళ్ళగానే ఒక శూద్రుడు వచ్చాడు. మిగిలినదానిలో కొంత యిచ్చాడు. అతడు తృప్తుడై వెళ్ళాడు. ఆతని వెనుకనే వచ్చాడు ఒక కుక్కను తీసుకుని మరియొకడు, ఆతడికి మిగిలిన అన్నమంతా యిచ్చాడు. తనకేకలేదు. అంతలో వచ్చాడొక చండాలుడు.

ప్రాణములన్ని కడపట్టి పోతున్నాయా చండాలునకు. తనను రక్షించవలసింది రంతిదేవుడేనన్నట్లు వచ్చి దీనుడై తన దీనత్వమును చెప్పుకున్నాడు. తానొక్క అడుగునైనా అవ్వలకు వేయలేనన్నాడు. ఏం చెయ్యాలి? రంతిదేవుడు? అన్నాడుగదా?

అన్నము లేదు కొన్నిమధురాంబువు లున్నవి త్రావు
మన్న రా
వన్న శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్ననమాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న
నొండుమే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తము డొక్కడసుమ్ము
పుల్కసా॥

అంటూ ఆ చండాలుని జ్వరాతిసారం పోవాలని భగవంతుని ప్రార్థించుతూ ఆ చండాలుని పాత్రలో నీరుపోశాడు.

ఆవచ్చినవారంతా బ్రహ్మాది దేవతలు. విష్ణుమాయనిచెప్పారు రంతిదేవునికి. ఆతని వినిర్మలోదకము భగవానున కత్యంత ప్రియమైనది. ఆ చండాలుడు మహావిష్ణువే. భారతీయసిద్ధాంతంలో ఆ సమయంలో వచ్చే చండాలాదులైనా విష్ణు స్వరూపులే.

భగవదనుగ్రహం యింత గొప్పది. ఇల్లాంటి అనుగ్రహంతోనే పార్థునకు విశ్వరూప సందర్శనమిచ్చారు. ఆ ఘట్టంవిను.

విశ్వరూప సందర్శనము అర్జునుని ప్రార్థనమీద అంగీకృతమై చూపబడ్డది. అంతవరకు శ్రీకృష్ణులు చతుర్భుజులే. శృంగారమూర్తియే. జగత్తంతా భగవానులే వ్యాపించి యున్నారన్నది శ్రీకృష్ణుని ఉపదేశ వాఙ్మయంగానే ఉన్నది పార్థునకు నాటివరకు. "విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్" అన్న వాక్యం అర్జునుని నోరూరించింది. ఆ రూపం చూడాలనుకున్నాడు. శిష్యుడు గనుక స్వామివారి ప్రసాదంగా స్వామీ! మీ విశ్వరూపమును నేను చూడగలనా? అర్హుడనేనా? అర్హుడనని తలిస్తే ఒక్కమారు దర్శనం యివ్వమన్నాడు. స్వామివారికి అనుగ్రహం కలిగింది. తన అత్యద్భుత మహిమను చూపితేనేగాని శిష్యునకు లక్ష్యసిద్ధి కుదరదనుకున్నారేమో చూపింపదలిచారు భగవాన్.

అర్జుననిది సామాన్యమనుష్య దృష్టిగదా? అది చూడజాలదు తను చూపదలచిన దివ్యరూపమును. అందుకని పార్థు

ఒగ్గి నుంచున్నారు. దేవతాయోనివిశేషులంతా కనపడ్డారు. ఆ విశ్వరూపుని ముఖగహ్వారం తెరవబడ్డది భయంకరంగా. ఆ గహ్వారంలో దంష్ట్రిలు, కరాళములు భయమును గొలుపు తున్నాయి. అంతేకాదు. ఆ ముఖగహ్వారంలోనించి అగ్ని జ్వాలలు భయంకరరూపంలో ప్రజ్వరిల్లుతూ వస్తున్నాయి. అర్జునునకేమి దిక్కుతోచటంలేదు. ధృతరాష్ట్రిని నూర్వురు పుత్రులు అక్కడే ఉన్నారు. భీష్మద్రోణులుకూడా కన బడ్డారు. ధనుర్బాణములతో కర్ణుడు ప్రత్యక్షమైనాడు. కొందరు యోధులు ఆయన ముఖగహ్వారంలోకి వెళ్ళిపోతు న్నారు. వెళ్ళినవారిలో కొందరు దంతముల మధ్యలో యిరు క్కుంటున్నారు. కొందరు నలిగి చూర్ణం చూర్ణమైపోతు న్నారు. తాను చూచిన పదునెనిమిది అక్షౌహిణీలసైన్యము, సముద్రంలోకి వెళ్ళే నదుల్లాగా ఆయన ముఖంలోకి పోతు న్నారు. అందులో కొందరను నాలుకతో చప్పరించుతున్నా డీ భయంకరస్వరూపుడు. కొంతదూరంపోయాక యీాన యెవ్వరోకూడా అర్జునునకర్థంకాకుండా పోయింది. తూర్పు పడమరలు, ఉత్తరదక్షిణాలుకూడా ఎటున్నాయో విభాగం లేకుండా పోయినాయి. భూమ్యాకాశాములకు పరిధి ఎక్కడ? సముద్రములేవి ? ఇందరు సూర్యులా ? ఒక్కచోట !! నే నెక్కడున్నాను ? ఈ ఉగ్రమూర్తి యెవరు ? యీానసే అడుగు దామనుకున్నాడు. ఒణికిపోతూ గద్గద స్వరంతో ఓ ఉగ్ర మూర్తీ! నీ వెవ్వరవో ! ఏమి ప్రవృత్తితో యీా ఘూరమును

ఒగ్గి నుంచున్నారు. దేవతాయోనివిశేషులంతా కనపడ్డారు. ఆ విశ్వరూపుని ముఖగహ్వరం తెరవబడ్డది భయంకరంగా. ఆ గహ్వరంలో దంష్ట్రిలు, కరాళములు భయమును గొలుపుతున్నాయి. అంతేకాదు. ఆ ముఖగహ్వరంలోనించి అగ్నిజ్వాలలు భయంకరరూపంలో ప్రజ్వరిల్లుతూ వస్తున్నాయి. అర్జునునకేమి దిక్కుతోచటంలేదు. ధృతరాష్ట్రిని నూర్వురు పుత్రులు అక్కడే ఉన్నారు. భీష్మద్రోణులుకూడా కనబడ్డారు. ధనుర్బాణములతో కర్ణుడు ప్రత్యక్షమైనాడు. కొందరు యోధులు ఆయన ముఖగహ్వరంలోకి వెళ్ళిపోతున్నారు. వెళ్ళినవారిలో కొందరు దంతముల మధ్యలో యిరుక్కుంటున్నారు. కొందరు నలిగి చూర్ణం చూర్ణమైపోతున్నారు. తాను చూచిన పదునెనిమిది అక్షౌహిణీలసైన్యము, సముద్రంలోకి వెళ్ళే నదుల్లాగా ఆయన ముఖంలోకి పోతున్నారు. అందులో కొందరను నాలుకతో చప్పరించుతున్నాడీ భయంకరస్వరూపుడు. కొంతదూరంపోయాక యీన యెవ్వరోకూడా అర్జునునకర్థంకాకుండా పోయింది. తూర్పు పడమరలు, ఉత్తరదక్షిణాలుకూడా ఎటున్నాయో విభాగం లేకుండా పోయినాయి. భూమ్యాకాశాములకు పరిధి ఎక్కడ? సముద్రములేవి? ఇందరు సూర్యులా? ఒక్కచోట!! నేనెక్కడున్నాను? ఈ ఉగ్రమూర్తి యెవరు? యీననే అడుగుదామనుకున్నాడు. ఒణికిపోతూ గద్గద స్వరంతో ఓ ఉగ్రమూర్తీ! నీ వెవ్వరవో! ఏమి ప్రవృత్తితో యీ రూపమును

ధరించావో అనుగ్రహించి చెప్పునాయనా అన్నాడు. యుద్ధ భూమి, తన కుపదేశంచేసే ప్రసంగం. తాను విశ్వరూపమును చూపమన్న కోరిక అన్ని మరిచిపోయినాడు. ఆ భయంకర మూర్తిదగ్గర వణికిపోతూ ఇలా అడిగేటప్పటికి ఆయన కను గ్రహం కలిగింది పాపం! భూనభోంతరాళాలు వ్యాపించి, బ్రహ్మాండాలు బ్రద్దలైనాయా! అన్నంతగొంతుకతో "కాలో స్మిలోకక్షయ కృత్ప్రవృద్ధః" నేను కాలుణ్ణి. ఈ లోకా న్నంతా లయంచేయటానికి సమర్థుణ్ణి. అందుకే వచ్చాను. జాగ్రత్త. నీ కభిముఖమైవుండే యీ రాజన్య సమూహము నంతా నువ్వు చంపాలనుకుంటున్నావా? నాచేతిలో యిది వరకే చచ్చారు. యశస్సును నీకు కట్టబెట్టదలచి నిన్ను యుద్ధం చెయ్యమంటున్నాను. నిమిత్తమాత్రంగా నుంచో! ఏమంటావు అని పెద్దగా అరిచాడు. ఆ ధ్వనితో అర్జునుని గుండె పగిలిపోయింది. అయినా కొంచెం స్మృతి కలిగింది కాబోలు. గద్గద స్వరంతో వణికిపోతూ, ఆద్యంత రహితమైన ఆ పరమేశ్వరుని, అక్షరస్వరూపునిగా భావించాడు. సమస్త దేవతలు యీ ఒక్కని అవయవములే ననుకున్నాడు. వేద వేద్యమైన పరమాత్మ వస్తువిదేగదా అని నిర్ణయించుకుని ఆ మాటలతోనే స్తోత్రంచేసి, "నమో నమస్తేస్తు సహస్ర కృత్వః॥ పునశ్చభూయోపి నమోనమస్తే" అని తాను యిది వరలో చేసిన తప్పులను ఒప్పుకుని క్షమాపణస్తోత్రం చదివి, నలుదిక్కులవున్న ఆయనకు నమస్కరించి, పూర్వరూపాన్ని చూపమన్నాడు. ఆ శరణాగతిని కోరినప్పుడే మూడుభావము

లతో తన్ను క్షమించమన్నాడు. "పితేవపుత్రస్య సఖేవసఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవసోఢుం." పుత్రునియొక్క దోష ములను తండ్రి క్షమించినట్లు, స్నేహితుడు స్నేహితుని దోష ములను క్షమించినట్లు, ప్రియురాలి దోషములను ప్రియుడు క్షమించినట్లు క్షమించమన్నాడు.

వి : ఓహోహో! ఇప్పుడా శరణాగతిలోని భావ ప్రపంచం లోకే వెళ్ళాలన్నమాట.

కృ : అవును.

వి : ఆ భావములను తరువాత చెబుదురుగాని అర్జునుడు తన తప్పులను ఏం చెప్పాడంటారు!

కృ : కృష్ణార్జునులిద్దరు అసలు బావమరదులని తెలుసుగా నీకు!

వి : ఆ.

కృ : ఆ సందర్భంగా నేను నిన్ను స్నేహితునిగాను, బావ మరిదినిగాను భావించి హాస్యమేమైనా చేసినానేమో స్వామీ! ఆ తప్పులనుమాత్రం తలచకండీ అని వణు కుతూ తన తప్పులను క్షమించమన్నాడు.

శ్లో॥ సఖేతిమత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ హే యాదవ హేసఖేతి
అజానతా మహిమానం తవేదం
మయాప్రమాదాత్ప్రణయేనవాపి

యచ్చావహాసార్థమ సత్కృతోసి
విహారశయ్యాసన భోజనేషు.

అన్నాడు.

వి : అబ్బ ! ఏకశయ్యమీాదనే పరుండేవారు కాబోలు !!
కృ : ఆఘట్టాలు చాలాచిత్రం. అవ్వి చెప్పటమైతే సంవత్స రాలు చాలవు.

వి : తరువాత ఏమైంది ?

కృ : అల్లా అడిగినా అదే రూపంలో ఉండి అర్జునా ! నీ యందనుగ్రహంతో యీా రూపమును చూపాను. యిదివరకెన్నడు యెవ్వరికి చూపలేదు. నీలాంటి భక్తునకే యిది చూడశక్యంగాని ఎంతటి వేదవేదాంగ పారగులైనా, దీక్షితులైనా భక్తివిరహితు లీమూర్తిని చూడజాలరని తన అనుగ్రహమును వర్ణించి రథం మీాద కూర్చున్న చతుర్భుజమూర్తిని చూపించారు. అర్జునుని వీపు చరిచారు భయంపోవటానికి. ప్రసన్న చిత్తంతో వున్న అర్జునునకు తరువాత ఉపదేశమంతా జరిగింది. భగవానుని మహిమ అర్థమైనదా! ఇల్లాంటి అనుగ్రహమునే సంపాదించుకో.

వి : చిత్తం. మరి నేను ధ్యానయోగంలో మూర్తియందు చేయవలసిన విశ్వరూపభావనను సెలవివ్వాలిమరి.

కృ : ఇల్లా భావించు.

అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్ర సూర్యౌ
దిశశ్శ్రోత్రే వాగ్వివృతాశ్చవేదాః
వాయుఃప్రాణోహృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీహ్యేషసర్వభూతాంతరాత్మా.

ముం. 2-1-4.

నీవు ఉపాసించేమూర్తికి అగ్నియే శిరస్సు. సూర్య చంద్రులే నేత్రములు. దిక్కులే చెవులు. వేదములే ఆయన వాక్కులు. వాయువే ఆయన ప్రాణము. ఈ కనబడే విశ్వ మంతా అయన హృదయం. ఈ భూమియే ఆయన పాద ములు. సర్వ భూతములలోవున్న అంతరాత్మయే యీ దివ్య విగ్రహం. ఆ విశ్వరూపుడే నీ హృదయంలోవున్న అంత ర్యామికూడా అని భావించాలి.

ఈనాటికి గోష్ఠి సమాప్తం చేద్దాం.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

ఓమ్

6 వ రోజు

# లోకాంతరయాత్ర

సాయంకాలమైంది. సంధ్యాద్యనుష్ఠానములు ముగిసి నాయి శ్రీకృష్ణానంద విజయులకిద్దరకు. ఇక వారి కర్తవ్యము గీతాశాస్త్ర గోష్ఠియె. గురు వందనాదికములతో గోష్ఠి ప్రారంభమైంది.

**విజయుడు :** మహాశయా ? యీనాడు నేను జీవుల ఉత్క్రాంతిని గురించి తెలుసుకొనదలచాను. (ఉత్క్రాంతి= మరణము)

**కృష్ణానందులు :** చాలా అవసరం. భారతీయ తత్వశాస్త్రంలో మొదటి సిద్ధాంతమే అది.

**వి :** అయితే భారతీయ విజ్ఞానం మరణంతోనే ప్రారంభమైన దంటారా ?

**కృ :** అవును.

**వి :** మానవుని విజ్ఞానము పుట్టుకతో గదా ? ప్రారంభం ?

**కృ :** పుట్టుకను నిర్ణయించునది మరణము.

**వి :** మన సిద్ధాంతము ప్రపంచ విరుద్ధమేమో ?

**కృ :** ప్రపంచము మనసిద్ధాంతమును విరుద్ధంగా చూస్తుంది.

వి : కారణం ?

కృ : అర్థంకాక.

వి : మరణమునకు పుట్టుకకు సంబంధమేమిటంటారు ?

కృ : నీకు కర్మయోగంలో యీ విషయమును చెప్పాను. క్రిందటి జన్మలో జీవుడు చేసిన కర్మను అనుసరించియే జీవులు ఉత్పన్నమౌతారని.

వి : అవును కర్మయోగంలో జీవులకు స్థావర జన్మలు వచ్చుటకుగాని. లేక జంగమములలో పశు, పక్షి, కీటక శరీరములు రావటానికిగాని, లేక బ్రాహ్మణాది వర్ణములలో పుట్టటానికిగాని జీవుల ప్రాక్తన కర్మయే కారణమని చెప్పారు. కాని నేను యీనాడు అడగ దలచినది అదికాదు.

కృ : క్రొత్త ప్రశ్న కాబోలు !

వి : అవును.

కృ : అడుగు.

వి : ధ్యానయోగులైనవారు ధ్యాననిష్ఠను అభ్యాసంచేస్తూ ఉంటారనుకోండి. ఆ అభ్యాసం పూర్తికాకుండానే వారు మరణంచెందవచ్చు. మరి యీ ధ్యాననిష్ఠ యొక్క ఫలం వారికి రాదుగదా ? మరి వారి గతి యేమిటి ? అని యోగనిష్ఠులను గురించి నా ప్రశ్న. అంతేకాదు. ఒకప్పుడు సాధకుడు కొంతకాలంగాధ్యాన నిష్ఠను ఆచరించి చిత్తచాంచల్యంతో స్థిరబుద్ధిలేని

వాడొక డా॥ప్రయత్నమును విరమించవచ్చు. అప్పుడా సాధకుని జీవితమును గురించికూడా ఏమౌతుందనేది నా రెండవ ప్రశ్న.

కృ : గీతాశాస్త్రంలో అర్జును డప్పుడే అడిగాడు శ్రీకృష్ణుని నీ వడిగిన ప్రశ్న.

వి : ఎక్కడంటారు ?

కృ : 6 అధ్యాయం 37, 38, 39 శ్లోకములలో.

వి : అయితే పార్థుని ప్రశ్నను అసలు వివరించండి.

కృ : "అయతిః శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥ 37
"కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మి వనశ్యతి;
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.
"ఏత న్మే సంశయం కృష్ణ ! ఛేత్తు మర్హ స్యశేషతః
త్వదన్య స్సంశయస్యాస్య ఛ్ఛేత్తా న హ్యుపపద్యతే॥
అర్జునుని సంశయమిది. చిత్తస్థైర్యమును కల్పించుకో

టానికి అభ్యాసయోగంలో ఉన్నాడు. శ్రద్ధగానే అనుష్ఠించు తున్నాడు యోగనిష్ఠను. కాని యింతలోనే మరణకాలం ఆసన్నమైంది. అతడ అభ్యాసయోగమును ప్రారంభించిననాటి నుండి స్వర్గాదిలోకముల నిచ్చే కర్మను చేయటంలేదు. ఆత్మ జ్ఞానమును గురించిన జిజ్ఞాసువై స్వరూపనిష్ఠను చేస్తూ ఆత్మ దర్శనమును పొందలేదు. ధ్యానసిద్ధిని పొంది భక్తితో భగవ ద్దర్శనానందము ననుభవించినవాడున్నూ కాదు. అంత్య కాలంలోకూడా ధ్యానాభ్యాస వశీకృత మనస్సు స్థిరరూపం

చెంది ఉన్నదా? అంటే అల్లాలేదు. చంచలమైన ఆ మనస్సు స్మృతిని కోల్పోయింది. ఇల్లాంటి స్థితిలో ఆ యోగి స్థితిని వర్ణించాలంటే గాలికి కొట్టుకుపొయ్యే మేఘం స్మృతికి వస్తోం దన్నాడు. ఆ మేఘము ఎక్కడ ఉంటుంది? దానికి ప్రత్యేక స్థానమెక్కడ? ఎక్కడా లేదు. అల్లా చెడిపోతాడా? చేసి నంతవరకు ఉపయోగించుకుందాంటావా? కృష్ణప్రభూ! నీవు తప్ప యీ సంశయమును నివారించువారు లేరని గట్టిగా అడి గాడు.

"సంశయచ్ఛేత్తా" అన్నాడు చివరిలో. మూలంతో పెకలించేవారుండరు అని అర్థం.

వి : సమాధానం ఏమిటంటారు?

కృ : ఏమిటేమిటి? జయభేరి వేసినట్లు ఒక్కటే మాట చెప్పారు శ్రీకృష్ణులు. శాస్త్రసిద్ధమైన పుణ్యకర్మను చేసిన ఏ వ్యక్తియైనాసరే ఇసుమంతకూడా నష్టపడ డన్నారు. చేసిన పుణ్య పాపకర్మలకు ఫలం రెండు చోట్ల అనుభవించవలసి ఉంటుంది భారతీయ సిద్ధాం తంలో. భౌతికవాదులకు ఫలం యీ లోకంతోనేసరి. తాను చేసిన తప్పుకు ఫలం యీ లోకంలోనే కనుక యిక్కడ తప్పించుకోటానికి ఉపాయం వెతుక్కుంటే చాలు అంటారు భౌతికవాదులు. కాని అలా కాదు. పుణ్య పాపఫలములకు లోకాంతర ప్రాప్తి ఉండటంచేత చేసిన యీ కళ్యాణ కార్యమునకు ఇహలోక పరలోక ముల రెంటను ఫలప్రాప్తి ఉన్నదన్నారు.

"పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కళ్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి.

తా॥ అర్జునా! మంచి కార్యమును చేసినవానికి దుర్గతి ఎప్పుడూ రాదు. ఇహపరములలో వానికి నాశము లేదు.

వి : అయితే యీ లోకంలోను పరలోకంలోనుకూడా ఏ విధమైన ఫలం పొందుతాడనేది ప్రశ్న.

కృ : స్వర్గాదిలోకములు వచ్చే అశ్వమేధాది క్రతువుల నీతడు ఆచరించకపోయినా వారికి వచ్చే పుణ్యఫల మీ యోగికి రాకపోదు. కర్మనిష్ఠునికన్నా యోగ నిష్ఠుడెప్పుడూ అధికుడుగాని తక్కువకాడు సముడు కూడా కాడు. తత్వశాస్త్రం యోగికిచ్చిన స్థానం కర్మనిష్ఠున కివ్వలేదు. యథార్థమునకు బాహ్యంకంటే ఆంతరం గొప్పదిగదా? బాహ్య పూజకంటె మాన సిక పూజకు ఫలమెక్కువ. అందుచేత ధ్యాననిష్ఠునకు అశ్వమేధాది క్రతువులు చేసినవారి పుణ్యలోకములు యీతడికి వస్తాయి. అక్కడ చాలా కాలంగా ధ్యానా భ్యాసంవల్ల వచ్చే పుణ్యఫలమును అనుభవించి ఆ ఫలము పూర్తి కాగానే ఇహలోకంలోకి వస్తాడు. ఇక్కడ గొప్ప శ్రీమంతుల గృహాలలో పుట్టి మంచి భోగానుభవములను అనుభవిస్తాడు. అంటే భోగానుభవమునకు తగిన శరీరం వస్తుందన్నమాట.

వి : అయితే ఇల్లాంటి వారినందరిని మనం యోగభ్రష్టు

లైనవారనే అనుకోవాలన్నమాట

కృ : అవును.

వి : అయితే యీ యోగభ్రష్టులలోకూడా తరతమ భేదాలున్నాయా ?

కృ : ఉత్తమ మధ్యమ అధమ భేదములు ప్రతిదానిలోను ఉంటాయి. యోగభ్రష్టులలోకూడా కేవల సన్యాస ధర్మములనే ఆశ్రయించి, వైరాగ్యాది సంపత్తి అధికంగా కలిగినవారు మాత్రం పుణ్యలోకములను చెందినా భూలోకమున పుట్టవలసివచ్చినప్పుడు శ్రీమంతుల గృహములలో కాకుండా దరిద్రులైన యోగుల గృహములందే పుడతారు.

వి : వారిద్దరిలో తేడా ఏమిటి ?

కృ : దరిద్రులైన బ్రహ్మవాదుల గృహములలో పుట్టటంలో తిరిగి యీ జన్మలోకూడా భోగలాలసుడుకాకుండా మాతాపితరుల అభ్యాసములు పూర్వదేహంలో చేసిన యోగనిష్ఠకే దోహదమై బ్రహ్మజ్ఞాన సంపదతో మోక్షమును పొందటానికి స్థానం వస్తుంది. శ్రీమంతుల గృహములలో అయితే ఆ భోగానుభవములు పూర్వజన్మయొక్క యోగ సంస్కారమును మరపు గలిగించి, యోగవాసనలను క్షయం చెయ్యవచ్చు. అందుకని యోగుల గృహములలోనే పుట్టటమనేది చాలా కష్టమన్నారు స్వామివారు. యోగభ్రష్టుల

జన్మను గురించిన శ్లోకము లివ్వి.

"ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే.
6. అ. 41 శ్లో.

"అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం॥ 42

"తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన॥ 43

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపిసః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ 44

42 శ్లోకంలో "ఏ తద్ధి దుర్లభతరం" అన్నారు.

వి : మధ్యలో యోగంచేస్తూ మానినవాడో ?

కృ : పూర్వాభ్యాస సంస్కారం మళ్ళీ జన్మలో మొలకెత్తి ప్రారంభించి, అక్కడనుంచి వృద్ధిచేసుకుని కృతార్థుడు కావచ్చు.

వి : మొత్తంమీద ఏ జన్మలో చేసిన అభ్యాసం ఆ జన్మలో అంతంకాకుండా ఆ బుద్ధిబలం తరువాత జన్మల కందించుతుందన్నమాట.

కృ : ఆ. మళ్ళీ మొదలక్కర్లేదు. క్రిందటి జన్మలో ఒక క్లాసు అయితే వచ్చే జన్మలో రెండవ తరగతి ప్రారంభం అవుతుంది. కర్మకైతే అల్లాకాదు. లోకాం

తరములలో ఆ కర్మ ఫలం క్షయమవుతుంది. ధ్యాన యోగంలో సంస్కారం ఆరూఢమవుతుంది. అందు వల్ల రెండో జన్మలో కించిత్తైనా యోగ జిజ్ఞాసకలిగినట్లయితే కర్మబంధములలోనించి బయటపడగలుగుతాడు. పర్యవసానం ఏ మాత్రం యోగజిజ్ఞాస కలిగినాచాలు కర్మబంధములను త్రెంచుతుందా సంస్కారం. అందుకని, యోగికి స్థానమిచ్చారు శ్రీకృష్ణులు. "జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ అన్నారు. వైదిక సిద్ధాంతంలో కొన్నివందల జన్మలకైనా జీవుడు కోరికను, సాధించుకునే అవకాశం ఉంది. పరతత్వాన్ని అందుకోటానికి ఒక జన్మచాలదు. అందుకే రుక్మిణీకళ్యాణంలో రుక్మిణి శ్రీకృష్ణునకు వ్రాసిన లేఖలో యీ విషయాన్ని ఉద్ఘాటించింది.

"... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ...నీ

యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూరుజన్మంబులన్

నినుజింతించుచు బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా.

భాగ. స్కం. 10

వి : ఒక్క మనవి, పుణ్యజీవులు, పాపజీవులు అని రెండు తెగలుగదా ? మరణ సమయంలో యీ శరీరమును వదలిపెట్టేటప్పుడు వీరిద్దరికి ఏమైనా భేదముంటుందా? ఉండదా ?

కృ : ఉంటుంది.

వి : ఏమంటారు ?

కృ : అజ్ఞానులైనవారి ఉత్క్రమణము నేత్రాది స్థానములలో యేస్థానము నుంచైనా కావచ్చు. విద్వాంసుల ఆత్మ అల్లాకాదు. శిరస్సునందలి కపాలమును భేదించుకుని వెళుతుంది.

వి : అసలు శరీరంలోనించి బయలు దేరేముందు ప్రయాణ సన్నాహం ఎల్లా ఉంటుందో !

కృ : గీతాశాస్త్రంలో ప్రత్యేకంగా చెప్పలేదుగాని బృహదారణ్యకోపనిషత్తులోను, వ్యాససూత్రములలోను చెప్పారు.

ఈ శరీరంలోనించి ఆత్మ బయలు దేరటానికి సిద్ధం కాగానే అంటే శరీర దౌర్బల్యంరాగానే ఇంద్రియ శక్తులన్ని తమ తమ స్థానములనువదలి జీవుని అనుసరించుతాయి. ఆ జీవుడు అవయవములలోనించి విభక్తమైన ఇంద్రియశక్తుల నన్నిటిని దగ్గరకు జేర్చుకుని హృదయకమలంలోకి వస్తాడు. అయితే అప్పటికి జీవునకు ఇంద్రియ చలనమంతా తగ్గిపోతుంది. ఒక్క ఉదాహరణను చెబుతాను. చుట్టూవున్న బంధువులందరు చూపులేదు అంటూ ఉంటారు. ఎందువల్లంటే చక్షురింద్రియమునకు అధిష్ఠానమైన ఆదిత్యుడు ఆ ఇంద్రియమునుంచి వైదొలిగాడన్నమాట. ఆ ఇంద్రియజ్యోతి ఆత్మలో కలిసింది. అల్లాగే ఇంద్రియాలన్ని చేస్తాయి. మన మాట ఏమీ వినటంలేదనికూడా అంటారు. హృదయాగ్రమాత్రం తేజో

వంతంగా ఉంటుంది. హృదయాగ్రం అంటే నాడీముఖం అన్నమాట. ఇతడు సూర్యలోకానికి వెళ్ళవలసిన వాడైతే నేత్రములగుండా వెళతాడు. బ్రహ్మలోకానికి వెళ్ళేవాడు కపాలంగుండా పోతాడు. మరీ పాపజీవులకు ప్రాణం అధో ముఖంగా పోతుంది. యోగికి అల్లాకాదు. హృదయ ప్రదేశంలో 101 నాడులుంటాయి. ఆ నాడులలో ఒకనాడి మూర్థ స్థానంలోనించి బయటకు వస్తుంది. ఆ నాడిగుండా పోతాడు సూర్యకిరణంద్వారా యోగి. అందువల్లనే యీతనికి అమృతత్వం కలుగుతుంది.

వి : మీరు చెప్పిన విషయమంతా ఎక్కడుందండి?

కృ : ఛాందోగ్యబృహదారణ్యక ఉపనిషత్తులు వర్ణించినాయి. మొత్తంమీద నాడీముఖంమాత్రం అందరికీ ఒకవిధంగానే భాసించుతుంది ఆ సమయంలో, ఆ నాడీ ముఖంనుంచి బయటకువెళ్ళే మార్గంమాత్రం భేదముంటుందన్నానుగదా? అంటే ఆ మరణకాలంలో రాజువెంటవెళ్ళే మంత్రిలాగా ప్రాణం ఉంటుంది. పరిజనుల్లాగా ఇంద్రియములుంటాయి. అయితే యీ జీవుడు ఎల్లాంటి జ్ఞానం కలిగిఉంటాడు? అంటే వాడు అదివరకుచేసిన కర్మను అనుసరించిన అంతఃకరణ సంస్కారమునుబట్టి ఉంటుంది ఆ సమయంలో జీవుని జ్ఞానభాండారం. ఆ సమయంలో లోగడ భక్తి, జ్ఞానము, లేక పుణ్యకర్మాసక్తి కలవాడైతే ఆ పుణ్య సంస్కారములు, లేకపోతే అవిద్యాసంస్కారంవచ్చి

ఆ సంబంధమైన అజ్ఞానం వుంటుంది. అందుకే గీతలో అంత్యకాలస్మరణను చెప్పారు స్వామి. అంత్యకాల స్మరణకు తగిన అభ్యాసం ముందేకావాలి. అంత్య కాల కర్తవ్యమును గురించి 8 అధ్యాయం 5వ శ్లోకం మొదలు 13వ శ్లోకందాకా. మొత్తం 9 శ్లోకములను వర్ణించారు.

వి : అన్ని శ్లోకములు ఒక్కవిషయమునే వర్ణించినారా ?

కృ : కాదు. 5వ శ్లోకంలో అంత్యకాలమునందు తననే స్మరించినవాడు తన స్వరూపమునే పొందుతాడని వర్ణించారు.

"అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర
సంశయః."

ఈ శ్లోకంలో "మామేవ" నన్నే అని నిర్ణయించారు. ఇతరములైన భావములేమీ రాకుండా అని అర్థం.

వి : మద్భావం అన్నప్పుడు ?

కృష్ణానందులు : నీకు ఏది ధ్యేయమైతే దాని స్వరూపమునన్నమాట. ప్రస్తుతము మనం సగుణ ధ్యానంలో ఉన్నాంకనుక సగుణమూర్తియొక్క భావ మని అర్థం. అందుకు సంశయంలేదన్నారు. 6వ శ్లోకంలో ఆ సమయంలో యేయే ఉపాధులను, అంటే భార్యయందు మమకారం ఉంటే స్త్రీని, లేక కొంత మందికి జంతుప్రేమ ఉండవచ్చు అవికూడా అప్పుడు స్మృతికి రావచ్చు.

వి : ఇది యోగులసంగతా ? ఉత్తవారి సంగతా ?

కృ : ప్రారబ్ధం చాలకపోతే యోగులకైనా అంతే.

వి : అల్లా చెడిపోయిన యోగులెవరైనా ఉన్నారా ?

కృ : లేకేం ?

భరతుడనే రాజర్షి ఆరణ్యంలో ధ్యాననిష్ఠను సలుపు తున్నాడు. ఒకరోజున అతడు స్నానార్థంగా ఒక నదికి వెళ్లాడు. అప్పుడే ఒక చూడిలేడి నీళ్ళు త్రాగటానికై వచ్చి ఒక భయం కర ధ్వనికి ఉలికిపడి నదిలోదూకింది. ఆ సందర్భంలో గర్భము భిన్నమై నీళ్ళల్లో పడిపోయింది లేడిపిల్ల. దయామయుడైన ఆ రాజర్షి ఆ లేడిని తెచ్చి తల్లి లేని పిల్లగదాయని పెంచాడు. ఆ పెంపకంలో దానిపైన వ్యామోహం పెరిగింది. కన్నబిడ్డ వలెనే ఉంది ఆలేడి. ఆయన జపానికి కూర్చునికూడా లేడిని గురించే స్మరించేవాడు. దానిని యే జంతువులైనా బాధిం చుతవేమోనని బాధపడేవాడు. అల్లా ఆ లేడిపైన మమకారం పెరిగి అంత్యకాలంలో ఆ లేడిపైననే దృష్టి ఉంచుకుని వచ్చే జన్మలో లేడిశరీరంమే వచ్చింది ఆయనకు.

వి : మరి అల్లా అంత్యకాలానికి భగవత్స్మృతి రావాలంటే ఏం చెయ్యాలంటారు ?

కృ : స్వామివారే చెప్పారు.

"తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ
మ య్యర్పితమనోబుద్ధిః మా మే వైష్యస్యసంశయః"

అన్ని సమయములలోను భగవత్సంబంధమును వదల కుండా ఉండాలి అన్నారు.

వి : చైముకావద్దండి?

కృ : నీవిధి కర్మకు భంగంలేకుండానే అనుకో. అయినా చివరలో చూసుకుందాం అనుకోవద్దని అర్థం. ఇందుకే ఒక మహానుభావుడన్నాడు—

శ్లో॥ కృష్ణ ! త్వదీయ పదపంకజ పంజరాంతం
అద్యైవ మేవిశతు మానసరాజహంసః
ప్రాణ ప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధన విధౌస్మరణం కుతస్తే।

కృష్ణా ! నా మనస్సనే రాజహంసను నీ పాదపద్మములనే పంజరంలో యిప్పుడే ప్రవేశపెడతాను. నా ప్రాణ ప్రయాణం సాగేముందు, నా కంఠం నా స్వాధీనంలో ఉండదు. శ్లేష్మం, లేకవాతం అడ్డవచ్చుగదా? అన్నాడు. చాలామంది ముసలితనంలో భగవంతుని పూజించుతాం అంటారు. అప్పుడుమాత్రం చేయగలరా? అప్పటి బాధ్యతలు, బాధలు అప్పుడుంటాయి.

వి : ఆ సందర్భం మనస్సుయొక్క దయమీద ఆధారపడింది.

కృ : కాదు. అభ్యాసయోగముయొక్క దయమీద ఆధారపడింది.

"అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్
8వ శ్లోకం.

వి : మరణసమయంలో భగవధ్ధ్యానం చేశేవారున్నారంటారా?

కృ : మహాపురుషు లెందరో ఉన్నారు. అందులోవాడే భీష్ముడు.

వి : భీష్ముడు యోగశక్తి ధురంధరుడుకూడా గదా?

కృ : అవును. నీకు అంతశక్తి లేకపోతే నామస్మరణచేసుకో.

వి : చిత్తం. అయితే యీ జీవులు అల్లా బయలుదేరి ఎక్కడికెక్కడకు ఏయేమార్గంకుండా పోతారంటారు?

కృ : జీవులు రెండువిధములు. పాపజీవులు, పుణ్యజీవులు. పుణ్యజీవులుకూడా రెండువిధములు. సత్రము వేయించుట, దేవాలయముల నిర్మింపజేయుట. చలివేంద్రములను ఏర్పాటుచేయుట, లేక యజ్ఞయాగములను చేయుట మొదలైన పుణ్యకర్మలు చేయువారొకరు. ధ్యానయోగులై ఓంకారాద్యుపాసనలు చేయువారొకరు. పాపులు వెళ్ళునవి నరకలోకములు. పుణ్యులు వెళ్ళునవి స్వర్గాది బ్రహ్మలోక పర్యంతమైన పుణ్యలోకములు. పాపజీవులు నరకములలోని యిరువదియొక్క ఘోరనరకస్థానములలోను వారి వారి కర్మానుగుణముగా శిక్షలననుభవింపక తప్పదు. ఆ యా శిక్షలకు అనుగుణ్యములైన శరీరములుకూడా వస్తాయి. శరీరంలోనించి పిండీకృతంగా చేయబడిన ఇంద్రియగణంతోను, ప్రాణవాయువుతోను కలసి, ఆ సూక్ష్మ

శరీరమున కాధారమైన ఇహలోక స్థూల శరీరము నిక్కడ వదలగా ఆ నరకాది లోకానుభవమునకు యోగ్యమైన శరీరములతో నరకదుఃఖములను అనుభవించుతారు.

వి : ఆ నరక బాధలు తప్పవన్నమాటేనా?

కృ : పుణ్యలోకములు తప్పవన్నమాటేనా? అని అడగవేం? నరకములు తప్పవు. పుణ్యాల త్రోవలను విను. అర్చిరాది మార్గమని, ధూమాదిమార్గమని రెండుమార్గములున్నాయి పుణ్యాలకు. కర్మనిష్ఠులు ధూమాది మార్గంగాను, ధ్యాననిష్ఠులు అర్చిరాది మార్గంగాను వెళుతారు. ఈ మార్గములకే పితృయానమని, దేవయానమని, దక్షిణాయన మార్గమని, ఉత్తరాయణ మార్గమని పేర్లు. దేహంలోనించి బయలుదేరిన కర్మనిష్ఠులు, ధ్యాననిష్ఠులు యీ మార్గములదాకా కలసి వచ్చి యీ మార్గములదగ్గర చీలుతారు.

వి : మరి వీరికి మార్గమధ్యంలో భోజనాది వసతులుంటాయా?

కృ : ఎందుకుండవు?

వి : ఎవరు సప్లయి చేస్తారండి!

కృ : జీవుని పూర్వకర్మ, పూర్వజ్ఞానము, పూర్వకర్మవాసనలు, ఇవన్నికలసి వీనికి వసతులు యిస్తాయి. మరొక దేహంకూడా వీటినిబట్టియే తయారవుతుంది జీవుడు

వెళ్ళటానికం టేముందే. రాజుగారు బయలు దేరటాని కంటే ముందుగా భటులు వెళ్ళి డేరాలను ఎల్లా వేస్తారో అల్లా కర్మ, కర్మవాసనలు, జ్ఞానము యివి వెళ్ళి శరీరమును సృష్టించుతాయి.

వి : ఆ ధూమాది అర్చిరాది మార్గములు ఎల్లావుంటాయి?

కృ : పొగ, రాత్రికాలము, కృష్ణపక్షము, దక్షిణాయనము అనేవి ఉన్నాయిగదా? వాటి అభిమాన దేవతల లోకములున్నాయి. ఆ లోకములకే ధూమాది మార్గం అని పేరు. ఆ లోకములమీదుగా చంద్ర లోక స్వర్గలోకములకు వెళుతారు కర్మనిష్ఠులు. అక్కడ పుణ్యం క్షీణించగానే మళ్ళీ పుడతారు భూలోకంలో. కర్మనిష్ఠులకు పైనుంచి సరాసరి మోక్షమార్గంలేదు.

వి : ఇప్పుడు మనవాకు విమానాలమీద వెళ్ళేవేగదా చంద్రలోకాలు?

కృ : కాదు. మనవారు మండలములకు వెళుతున్నారుగాని లోకములకుకాదు. మన స్థూల శరీరంవంటివి మండలములు. మన సూక్ష్మేంద్రియములవంటివి లోకములు.

ధూమో రాత్రి స్తథాకృష్ణ షణ్మాసా దక్షిణాయనం
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్యనివర్తతే॥
౮. అ. 25 శ్లోకం.

అర్చిరాదిమార్గములు, అగ్ని, జ్యోతి, పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణము అనే వాటియొక్క అభిమాన దేవతల లోకాలు. వారి లోకాలలోకుండా వెళుతారు ధ్యాన యోగులు. బ్రహ్మలోకమునకు వెళ్లి క్రమంగా ఆత్మవిచారణచేసి ముక్తులౌతారు జీవబ్రహ్మైక్యంతో అని అద్వైత సిద్ధాంతం. ద్వైత విశిష్టాద్వైతములలో అప్రాకృత వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది. అర్చిరాది మార్గమును ఇలా వర్ణించింది గీత.

"అగ్నిర్జ్యోతి రహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణం
తత్రప్రయాతా గచ్ఛంతిబ్రహ్మ బ్రహ్మవిదోజనాః
8. అ. 24 శ్లో.

తెలిసిందా ? యీ రెండు మార్గములకే శుక్లమార్గమని కృష్ణమార్గమనికూడా అంటారు.

వి : చిత్రం. వైకుంఠానికివెళ్ళేవారి సంగతేమిటండి ?

కృ : ఆ వైకుంఠంలో శ్రీవారి అంతఃపురానికి చేరాలంటే యెనిమిది ద్వారములుంటాయి. ఒక్కొక్క విధంగా ఉపాసించిన ఉపాసకుల కొక్కొక్క ద్వారంవద్ద నివాసం కలుగుతుంది. ఆ ద్వారం దగ్గర ఆ కళ్యాణ మూర్తిని ఉపాసించుతూ సత్యులై ఆ లోకంలోనే ఉంటారు.

వి : ఇప్పుడు ఆ దివ్యమంగళ విగ్రహమును హృదయపుండ రీకంలో ధ్యానించినవారే ద్వారంలో ఉంటారంటారు ?

కృ : ఆ ఎనిమిది ద్వారములలోను ఎనిమిది శక్తులతో ఆరాధింపబడుతూ ఉంటారు స్వామి. నీ వడిగిన మహనీయులు ఆరవ ద్వారంలో తుష్టి అనే శక్తినికూడిఉన్న స్వామిని సేవించుతూ ఆ ద్వారంవద్ద ద్వారపాలకులై ఉంటారు.

మ. సరసీజాక్షునిగా జతుర్భుజునిగా సౌవర్ణ కౌశేయుగా
బరమానందునిగా బ్రసన్నముఖుగా బ్రాదేశ
మాత్రాంగుగా
నిరతంబున్ దనుజింతచేసినసుధీనిర్దోషరత్నాళికా
కరమా నారవచోట తుష్టివలనన్ కాంచెన్
విభుండర్చనల్.

శ్రీరామచంద్రులు వైకుంఠమును చేరగా ఆ సందర్భంలో వర్ణించిన వర్ణనలివ్వి. ఉత్తరరామాయణంలో. తరువాతేమిటి ?

వి : యీ కర్మనిష్ఠులైన పుణ్యాత్ములు లోకాంతరముల నుంచి తిరిగి భూలోకంలోకి రావాలంటే వచ్చేందుకు మార్గములు వర్ణించబడ్డాయా ?

కృ : ఆ. కర్ములు రావటానికి అయిదు లోకములు ఉన్నాయి ద్యుః, పర్జన్య, పృథివీ, పురుష, యోషి

త్తులు. అనే పేర్లు గలవి. ఈ లోకములనే అగ్నులు అనికూడా అంటారు. ఇవి పంచాగ్నులు. ప్రపంచసృష్టి అంతా అగ్నిలో వేల్చే ఆహుతులమీద ఆధారపడి ఉంది. ఆ ఆహుతులు ఒక విధమైన అపూర్వమును పుట్టించుతాయి. (అపూర్వమనగా పుణ్యము) ఆ కర్మలకు అగ్ని ప్రధానం కాబట్టి వారు వచ్చే మార్గములకు అగ్నిఅని పేరుపెట్టింది శ్రుతి. ద్యులోకమనగా స్వర్గము. ఇది మొదటి అగ్ని. పర్జన్యుడనగా వర్షాభిమాన దేవత అయిన యింద్రుడు. ఇది రెండవ అగ్ని. భూమి మూడవ అగ్ని. మనుష్యుడు నాల్గవ అగ్ని. అయిదవ అగ్ని స్త్రీ. అనగా తన కర్మ విశేషంతో సూక్ష్మాకాశమునుండి వర్ష రూపంలో భూమిపైనున్న సస్యములలో ప్రవేశించుతాడు. ఆ సస్యములనుండి తాను పుట్టదగిన పురుషునిలో వీర్యంగా మారతాడు. ఆ వీర్యంవెళ్ళి స్త్రీలో ప్రవేశించగా జన్మ వస్తుంది. ఇల్లా చక్రంలాగా తిరుగుతూ ఉంటాడు. ఇది తెలిసిన వారు అల్లా పుట్టకుండా ఉండే ధ్యానయోగమును అభ్యసించిగాని, లేక కేవలము జ్ఞానులైగాని కృతార్థులౌతారు. అందుకని అంత్యకాలంలో ప్రణవ ధ్యానంతో వెళ్ళే మహా పురుషులను వర్ణించారు గీతాచార్యులు.

వి : ఇలా లోకాంతరములకు వెళ్ళే పుణ్యజీవుని చూచిన వారెవరైనా ఉన్నారా?

కృ : లేకేం. ఉన్నారు. భీష్మ ద్రోణులు వెళుతూండగా ఆ సమీపంలో ఉన్న ధర్మరాజు మొదలైన కొందరు చూచినట్లుంది భారతంలో.

వి : భీష్మ ద్రోణు లిద్దరు ఒక్కమారు పోలేదుగదా ?

కృ : లేదు. భీష్ముడు ఉత్తరాయణం కొరకు కనిపెట్టుకుని ఉన్నారు.

వి : దక్షిణాయనంలో పోయిన యోగులకు ఉత్తరాయణంలో పోయిన యోగులకు మార్గాల్లోను లోక ప్రాప్తిలో తేడాలున్నాయంటారా ?

కృ : లేవు. జీవుడు దేహమును వదలటానికి కాలనియమం లేదు. అది తెలియని వారనుకుంటారు,

వి : మరి లేకపోతే భీష్ముడెందుకు కనిపెట్టుకున్నారండి ?

కృ : తనకు తండ్రిగారిచ్చిన స్వచ్ఛంద మరణ వరమును పాటించి ఆ పితృదత్త వర ప్రభావమును ప్రకటించటమే ఆయన నిరీక్షణకు అంతరార్థం. ఈ విషయమును భాష్యకారులుచర్చించారు.ఉత్తరాయణంలో ఉత్క్రమణకు గొప్పతనం ఉన్నదని దక్షిణాయనమునకు లేదని అనుకోవటం లోకాచారము. అవిద్వాంసుల సంగతీ అని వ్యాససూత్రములలో నాలుగో అధ్యాయం రెండవ పాదంలో 20వ సూత్రందగ్గర విచారించారు

భాష్యకారులు.* ఇది జీవుల లోకాంతరయాత్ర.

వి : ఒక్క ప్రశ్న. అసలీ లోకాలన్ని బయట లేవని మన శరీరంలోనే తపోలోకాదికములన్ని ఉన్నాయని కొందరంటారు. అదేమిటి ?

కృ : అసలు మన శరీరములేదు శరీరంలో లోకాలు లేవు యీ జగత్తంతా లేదు. పెండ్లాము, బిడ్డలు, వారితోటి సుఖము కల్పించుకున్నవేగాని యధార్థంగా లేవంటారు కొందరు. ఆదేమైనా విన్నావా ?

వి : మొదటికే పెట్టారా మోసం ?

కృ : నేను పెట్టటంకాదు. అన్ని నిజములే. అధికారిని పట్టి శాస్త్రములు ఒక్కొక్క స్థితిని వర్ణించినాయి. పిండాండ సృష్టిలోనించి బ్రహ్మాండ సృష్టిలో తిరిగే విధంలో బ్రహ్మాండంలోని లోకవర్ణనం సత్యం. పిండాండ సృష్టిని సత్యమనేవారికి ఉపాసనా దృష్టిలో బాహ్యలోకములులేవు. శరీరాంతర్వర్తులై ఉన్నాయి. అంతా మిథ్య అన్నవారికి పై రెండూ లేవు.

వి : సందేహం తీరింది.

---

* సూ. అతశ్చాయనేపి దక్షిణే. సూ. 20. దక్షిణాయన అధికరణం. ప్రాశస్త్యప్రసిద్ధిరవిద్వద్విషయా. భీష్మవ్యక్తూత్తరాయణ ప్రతిపాలనం ఆచారపరిపాల నార్థం పితృప్రసాదలబ్ధ స్వచ్ఛంద మృత్యుతాఖ్యాపనార్థంచ.

వి : ఉపాసకుల జీవోత్క్రమణలో యింకేమైనా భేదము లున్నాయా ?

కృ : ఉన్నది. హఠయోగశక్తి లేకుండా కేవల ధ్యానంచేసే వారు మృత్యువు సమీపించగా వారి ప్రయత్నంలేకుం డానే వారి శరీర త్యాగం జరుగుతుంది.
ప్రత్యేకంగా యోగశక్తి కలవారు తాము శరీర త్యాగ మును చేయదలచుకున్నప్పుడు ఇంద్రియములనన్ని నియమించుకుని, మనస్సునుకూడా నిరోధించుకుని మూలాధారం దగ్గరనుంచి వాయువును హృదయ పుండరీకం దగ్గరకు తెచ్చి, సుషుమ్నానాడిలోనించి కంఠ స్థానానికి, అక్కడనుంచి కనుబొమల మధ్యకు తెచ్చి, అక్కడనుంచి సహస్రారమునకు తెచ్చుకుని బ్రహ్మస్వరూపమైన ఓంకారమును ధ్యానించుతూ కపాలమును భేదించుకుని వెళ్లుతారు. కుంభక ప్రాణా యామాభ్యాసం చేసినవారు. రామాయణంలలో శర భంగమహర్షి వారలా వెళ్ళారు రామచంద్రుని ఎదుట. ఈ విషయమును 8 అధ్యాయం. 12, 13 శ్లోకములలో వర్ణించారు.

"సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగ
ధారణాం.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్

యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిం

వి : బ్రహ్మలోకానికి వెళ్ళి చాలా కాలం ఉంటారుగదా యీ మహానుభావులు. మన కాలమానము ఆ బ్రహ్మాది లోకముల కాలమానము ఒకటే నంటారా ?

కృ : కాదు. కాలమానము మూడు విధములు. 1. మనుష్యమానము. 2. పితృమానము 3. దేవమానము. మన కొక మహాయుగమైతే దేవతలకొక యుగమౌతుంది. మన మనుష్యమానంలో నాలుగు యుగముల ప్రమాణమైతే ఒక మహాయుగమని పేరు. నలుబదిమూడు లక్షల యిరువదివేల సంవత్సరములైతే ఒక మహాయుగమౌతుంది. ఆ లెఖ్ఖలో బ్రహ్మదేవుని పగటి కాలం నాలుగువందల ముప్పదిరెండు కోట్లు. రాత్రి కాలముకూడా అంతే. ఆయన రాత్రి కాలములో అంతా అంటేసర్వసృష్టిలయమౌతుంది. పగటికాలంలో బయటకు వస్తుంది. పగటికాలం వచ్చిందాకా జీవులంతా ఆ అవ్యక్తంలో కలిసిపోయి ఉంటారు. పగటి కాలం రావటంతోటే తమ సంస్కారములతో సృష్టి అవుతూ ఉంటారు. 8. అ. 17. 18 శ్లోకాల్లో వర్ణించారు గీతలో. ఈనాటికి ముగించుదామా ?

వి : ఒక్క సందేహం తీర్చి ముగించండి.

కృ : అలాగే. అడుగు.

వి : 7 అధ్యాయం చివర అధిభూతమని, అధి యజ్ఞమని అధిదైవమని వర్ణించారే ఆ మాటలకు అర్థం చెప్పి ముగించండి.

కృ : పుట్టుకకలిగిన ప్రతి వస్తువుకు అధిభూతమని పేరు. అధి యజ్ఞమనగా అన్ని యజ్ఞములను అభిమానించిన యజ్ఞేశ్వరుడైన విష్ణువు. అధిదైవమనగా సూర్యమండలంలో ఉండే హిరణ్మయ పురుషుడు. అతడే అన్ని ప్రాణుల అంతఃకరణలో ఉండి అనుగ్రహించుతూ ఉంటాడు. ఆ అధి యజ్ఞమును నేనే అన్నారు శ్రీవారు.

వి : చిత్తం. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇంతతో గోష్ఠిని ముగించి యిద్దరు నిష్క్రమించారు.



ఓమ్

7 వ రోజు

## శరణాగతి

కృష్ణానంద విజయు లిద్దరు ప్రవేశించారు. విజయుడు ముకుళితహస్తుడై నమస్కరించి, గురువర్యుల పాదములపై వ్రాలి. గురువర్యుల పవిత్ర హస్తమును తన శిరముపైనుంచి దీవించగా లేచి గురువుల అనుజ్ఞతో గోష్ఠిని ప్రారంభించారు.

వి : స్వామీ ! నిన్న సమస్త భూతముల హృదయముల లోను ఈశ్వరున్నాడని, ఆ అంతర్యామినే సాధకులు ధ్యేయమూర్తినిగా పరిగ్రహించి, శబ్దబ్రహ్మగాగాని లేక కళ్యాణరూపుడై వెలసిన అవతారమూర్తిగాగాని రూపకల్పనను గావించుకొని ధ్యానించి, ఆ ధ్యేయ మూర్తినే విశ్వరూపునిగా ఉపాసించమన్నారు. తరువాత సాధకుని కర్తవ్యమేమిటంటారు ?

కృ : ఆ మధురమూర్తి కత్యంత సన్నిహితులైనవారిలో నీవుకూడా ఒకడవు కావాలి.

వి : పెద్దమాటే. అర్జునుడను కానా ? కుచేలుడను కానా గోపికలలో చేరనా ?

కృ : వారందరు నీవు కావలసిందే.

వి : నా కర్థంకాలేదు. నేను వారందరుగా ఎల్లా అవుతాను?

కృ : వారికి భగవంతునకు ఉండే సంబంధమునే భగవంతునితో నీవు కల్పించుకోవాలి. అర్జునుడు నిన్న భగవంనితో మూడు సంబంధములను కల్పించుకుని తనను క్షమించమన్నాడు. పుత్రుడు-తండ్రి. స్నేహితుడు-స్నేహితుడు. ప్రియురాలు-ప్రియుడు సంబంధములను మూటిని చెప్పి, కొడుకు తప్పును తండ్రి, స్నేహితుని తప్పును స్నేహితుడు, ప్రియురాలి తప్పును ప్రియుడు ఎలా క్షమించుతారో అలా ఆ భావాలతో నన్ను గూడా క్షమించు అన్నాడు. అంటే జీవునకు భగవంతునకు యీ మూడు సంబంధములుగల భావబంధమున్నదని అర్థం.

ఈ మూడు సంబంధములలో ముఖ్యాతి ముఖ్యమై తెలసినది ప్రియురాలి ప్రియ సంబంధము. అంటే నాయికా నాయక సంబంధమన్నమాట.

వి : చివరకు భక్తిని శృంగారంలో దించారేమిటి?

కృ : నేను దించలేదు. జీవులంతా స్త్రీ స్వరూపమైతే భగవంతు డొక్కడే పురుషుడౌతాడు సగుణ భక్తిలో. లేక ద్వైత దృష్టిలో సాధకునకు. ఈ విషయమునే రామాయణంలో సీతారాములుగాను, గీతలో కృష్ణార్జునులుగాను, భాగవతాది పురాణములలో రాధా

కృష్ణులు, గోపికా కృష్ణులుగాను వర్ణించబడింది.

వి : భక్తికి శృంగారమునకు సంబంధమేమిటండి ?

కృ : శృంగారమంటే విషయానంద మనుకుంటున్నావు కాబోలు. కాదు. ధ్యానయోగంలో ధ్యేయమూర్తి అనుగ్రహంతో చిత్తము మెత్తపడగా భగవంతుడే శరణ్యమను భావము దృఢమౌతుంది. భగవంతునకు సాధకునకుఒకరినివదలి ఒకరుఉండలేనిస్థితిఒకటి కలుగుతుంది. ఆ స్థితిలోకనుక ఏ కారణం చేతనైనా వియోగమే సంభవించితే సాధకుని చిత్తము కొన్ని అవస్థాంతరములను పొందుతుంది. సంయోగము, వియోగము అనేవి రెండే జగత్తునందు జీవునకు సుఖ దుఃఖముల నిచ్చునవి. జీవునకు జీవునకు కలిగే సంయోగ వియోగములు సంసార బంధమును కల్పించగా జీవునకు భగవంతునకు కలిగే సంయోగ వియోగములు సంసార బంధమును త్రెంచి మోక్షము నిస్తాయి. ప్రాకృత శృంగారమును సామాన్య కావ్యములు వర్ణించగా అప్రాకృత శృంగారమును, ఆదికావ్యమైన రామాయణము, వ్యాసభగవానుని కంత్య వాఙ్మయమైన భాగవతమును వర్ణించినాయి. అలంకార శాస్త్రమున కత్యంత ప్రధానమైన శృంగారరసమున కధిష్ఠానములు, లేక భక్తిరసమున కధిష్ఠానములు, సీతారాములు లేక, పార్వతీ పరమేశ్వరులు, లేక రాధాకృష్ణులు, లేక

ఏకైకమైన బ్రహ్మపదార్థము. సగుణ భక్తిలో జీవే - శ్వరులనే రెండు పదార్థములు విభక్తంకాగా వాత్సల్య, సఖ్య, మధురభక్తులని భక్తి మూడు విధ ములుగా విభక్తమౌతుంది. వాత్సల్యంలో వియోగ మును భరించలేక దశరథుడు రాముని స్మరించుతూ ప్రాణములను వదిలాడు. సఖ్యభక్తిలో గుహుడు, సుగ్రీవుడు, రామాయణంలోను, గోపకుమారులు, కుచేలుడు, అర్జునుడు భాగవతంలోను, సనాతనబ్రహ్మ ముతో క్రీడలనాడారు. మధురభక్తిలో, సీతాకాంత ఒకతే రాముని కొల్వగా మహర్షులందరు కృష్ణ బ్రహ్మ ముతో సంభోగ, వియోగ శృంగార క్రీడా విహార మున మన్మథ దిగ్విజయ యాత్రలో శ్రీకృష్ణ బ్రహ్మ మునకు సహాయులై సేవకగణంగా నుంచున్నారు. గోపికలై. మూడవదైన మధుర భక్తి గోపికలవంటిది కలగాలంటే కొన్ని కోట్ల జన్మలలో సంపాదించే మహాపుణ్యపుంజం గాని చాలదు. భాగవతంలో ఉద్ధవు డంటాడు గోపికల విషయంలో.

మ. "జపదానవ్రత హోమసంయమ తపస్స్వాధ్యాయ
ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియునేవిభున్ మనములన్ నిల్పంగలేరట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ
కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చెనె భవచ్చారిత్రముల్
చిత్రముల్."

వి : రాధ మేనత్తగాదండీ కృష్ణునకు ?

కృ : చాలా పొరపాటు. రాధకు కళ్యాణమున్నది బ్రహ్మ వైవర్త పురాణంలో. జయదేవుడు, క్షేత్రయ్య నారాయణతీర్థులు మొదలైన కవి శేఖరులకు రాధ ఉపాస్యమైన పరాశక్తి. పరాశక్తి స్వరూపము పరిపూర్ణ శృంగారరసము. "శృంగారరస సంపూర్ణా" అని సహస్రనామము.

వి : అయితే నన్నిప్పుడు రాధనుగా మారమంటారు.

కృ : మారలేవు. ఈ జన్మలో మారటానికి ప్రయత్నం చెయ్యి. తత్వం తెలియని అజ్ఞానులు కృష్ణావతారమును అర్థం చేసుకోలేరు. నీవు కేవలము రాధవు కావటం కాదు. విరహిణివైన సీతవు రాధవుకూడా కావాలి సీతకు లంకలో రామ వియోగమనే పంచాగ్ని మధ్యమందలి తపస్సు సిద్ధించగా అభిముఖమై ఉన్న అశోకవనమందలి పుష్పములుగాని, రాక్షస స్త్రీలుగాని, కనపడలేదు. రాముడొక్కడే కనపడ్డాడు. అందుకే రామసామ్రాజ్యంలో రాణి అయింది. రాధకు శ్రీకృష్ణుడు నాలుగు చేతులతో శ్రీమహావిష్ణువై కనపడదామని ఒకప్పుడు ప్రయత్నించికూడా అసమర్థుడైనాడు. ఆమె భావనలో ఉన్న మురళీకృష్ణుడుగానే ఉండిపోవలసివచ్చింది. భక్తశేఖరుల భావనా వైభవమే సచ్చిదానంద బ్రహ్మము యొక్క నామరూపవైభవము. సగుణ భక్తిలో

"అన్యథా శరణం నాస్తిత్వమేవ శరణంమమ" అన్నదే శరణాగతి. భక్తశేఖరులందరు యీ శరణాగతితోనే ముక్తులైనారు. సచ్చిదానంద బ్రహ్మముయొక్క రూపగుణ సంపదలు సనక సనందానాదులకు, దండ కారణ్యమునందలి ముని బృందమునకు మోహమును కల్పించినాయి. సాధకునకు సగుణోపాసనే శ్రేష్ఠ మన్నారు 12వ అధ్యాయం 5 వ శ్లోకంలో.

సగుణమూర్తిని నీవు శరణుపొందగా ఆ అంతర్యామి మూర్తియే, లేక వశీకృతమాయుడై మూర్తమైవెలసిన ఆ బ్రహ్మమే నీ అంతర్యామియై నీ స్వస్వరూపమును సాక్షాత్కరింపజేస్తాడు. నీ ధర్మఫలమంతా ఆయనదే, నీ దారాపుత్రాది సంపదలన్నీ ఆయనవే. నీదేమీ లేదు. అన్న మానసిక సన్యాసమే శరణాగతి. రామాయణంలో విభీషణుడు దారాపుత్రాదికమంతా రామబ్రహ్మమునకే అర్పించాడు. రామచంద్రునికన్న ప్రియమైన వస్తువులేదని గుహుడు తన ఆత్మప్రియత్వమును వదలుకున్నాడు. గోపికలు నీ దాసీల మన్నారు. తమ సుఖస్వరూపమంతా శ్రీకృష్ణుడేనని శరణు పొందారు. శరణాగతి తరతమభేదములతో చాలా విధము లుగావుంది. 18 అధ్యాయంలో 66వ శ్లోకమునకు చరమ శ్లోకమని పేరు.

"సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ.
అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామి మాశుచః"

ఇంతకు పూర్వము నేను పాపినిగదా! పాపఫలములు నన్నేమిచేస్తాయో అన్న భయం నీకువద్దు. ఇప్పుడు నీవుచేసే ధ్యానంతోగాని, దానధర్మాదికములచే కలుగు పుణ్యఫలము లతోగాని నీకు సంబంధంవద్దు. నావెంట సర్వజగద్రక్షకు డున్నాడు. నేను అరణ్యంలో నడిస్తే దొంగలు నా దగ్గరకు రారు. నేను నగరంలో నడుస్తుంటే నాగరిక వ్యామోహా ములు నన్ను బంధించవు అన్న ధైర్యంతో ఉండటమే యీ యోగంలో శరణాగతి. అద్వైతనిష్ఠలో సర్వకర్మ సన్యాస మెల్లాగో అటువంటి సన్యాసం రావాలంటే యీ యోగంలో యీలాగంటి భావంకావాలి. ఈ శరణాగతితోనే ఆయన మాయను దాటాలి.

వి : అయన మాయకు తాళంచెవి ఆయన దగ్గరనే ఉన్న దన్నమాట.

కృ : దైవీహ్యేషా గుణమయీ మమమాయాదురత్యయా
మామేవయేప్రపద్యంతే మాయామేతాంతరంతి తే.
7 అ. 14వ శ్లోకం.

వి : భక్తుల లక్షణాలు ఎల్లా ఉంటాయండి?

కృ : భక్తులు, జ్ఞానులు. ఒక లక్షణాలు కలవారే.
అద్వేష్టా సర్వభూతానాం మైత్రఃకరుణ ఏవచ
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖక్షమీ.

భగవంతునకంటె జగత్తు వేరుకాదని ఏ భూతమును ద్వేషించడు. భగవంతుని ప్రేమించుతాడుగనుక భూతము లను ప్రేమించుతాడు. తన ప్రీతినంతా భగవంతున కర్పిం

చాటు కనుక మమకారం లేదు. భ క్తిలో ఎప్పుడు తను లేడు, భగవంతుడున్నాడు. అందు చేత అహం లేదు. సుఖదుఃఖ ములు ఎన్ని వచ్చినా మేడలో ఉన్నవానిని వానజల్లు లేం చేస్తాయి ? భ క్తుని సుఖదుఃఖములు వంచించవు. ఇదే భ క్తుని లక్షణ వర్ణనములలోని సారము.

వి : పర్యవసానంలో భగవానునికి సాధకునకు నాయికా నాయక సంబంధమంటారు.

కృ : అవును. భగవద్విరహంతో మనస్సు త ప్తంకాగా ఆ అంతఃకరణలోని పాపపంకిలమంతా దగ్ధమై ఆ అంతః కరణము త ప్తకాంచనమై, ఆ కాంచనవర్ణమైనసీచి త విరహిణి, ఆ మేఘశ్యామునితోకూడి భగవ ద్రతితో ఆత్మజ్ఞాన పుత్రరత్నమును నీ కందించుతుంది. శ్రీకృష్ణుని శృంగావర్ణనంతో యీ ఘట్టమునుముగించు తాను.

శ్లో. శృంగార రససర్వస్వంశిఖిపిఛవిభూషితం
అంగీకృతనరాకారం ఆశ్రయేభువనాశ్రయం.

వి : ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీకృష్ణార్పణమస్తు